## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ ర స్తు

శ్రీమహాకవి కాళిదాసకృత

# ఋ తు సం హా ర ము

ఆంధ్రటీకాతాత్పర్యసహితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

1954

•

శ్రీరస్తు.

# ఋతుసంహారము

## ప్రథమసర్గము.

---

అవ. "కాళిదాసుఁ"డను పేరుగల యొక కవీశ్వరుఁడు సకల ఋతువుల యందును సుఖానుభవమునకు మార్గములు గలవని చెప్పుచు "ఋతుసంహార" మనియెడు నొక కావ్యమును రచియించువాఁడై తొలుత గ్రీష్మర్తువును వర్ణించుచున్నాఁడు. ఇచట నొక నాయకుఁడు తన ప్రియురాలికి గ్రీష్మర్తు వర్ణన మనెడు కథను చెప్పుచున్నాఁడని వస్తునిర్దేశమును మంగళము నాచరించు చున్నాఁడు.—

శ్లో. ప్రచండసూర్యః స్పృహణీయచంద్రమాః
సదావగాహక్షమవారిసంచయః,
దినాంతరమ్యోఽభ్యుపశాంతమన్మథో
నిదాఘకాలోఽయముపాగతః ప్రియే. 1

టీ. ప్రియే = ప్రియురాలా! ప్రచండసూర్యః-ప్రచండ = మిక్కిలి తీక్ష్ణమైన, సూర్యః = సూర్యుఁడుగలదియు, స్పృహణీయచంద్రమాః-స్పృహణీయ = కోరఁదగిన, చంద్రమాః = చంద్రుఁడుగలదియు, సదా = ఎల్లప్పుడు (పగలు ఎప్పుడైనను), అవగాహక్షమ వారిసంచయః-అవగాహ = స్నానమునకు, క్షమ = తగిన, వారిసంచయః = ఉదకసమూహముగలదియు, దినాంతరమ్యః - దినాంత = పగటితుదయందు (సూర్యుఁ డస్తమించినది మొదలుకొని ఉదయమువఱకు), రమ్యః = రమణీయమైనదియు (రాత్రివేళ సూర్యతాపముదీఱి సుఖముగా నుండు ననుట), అభ్యుపశాంతమన్మథః - అభ్యుపశాంత = మిక్కిలి

యణఁగిన, మన్మథః=కామముగలదియు, (అనఁగా వసంతకాలమందలి కామము ద్విగుణము గనుక అట్టి కామోద్రేకము తగ్గినదనుట). అయం నిదాఘకాలః= ఈ గ్రీష్మకాలము ఉపాగతః = వచ్చినది.

తా. ప్రియురాలా! చూచితివే? యీ గ్రీష్మఋతువు ఇందు పగలు సూర్యుఁడు తీక్ష్ణముగ నెండకాయుచుండుటచేత సరస్తటాకాది జలాశయములయందు అవగాహనము బహుసుఖముగదా? ఇట్టవగాహమునకు మఱియొక ఋతువనువుపడదు. మఱియు సాయంకాల మయినది మొదలిష్టజనముతోఁ గూడి బయళ్లయందు వెన్నెలలో విహరించుచు శీతలద్రవ్యంబుల సేవించుచు, గీతనృత్త్యాది వివిధభోగంబు లనుభవించుటకుం దగినది గదా! *

శ్లో. నిశాశ్శశాంకక్షతనీలరాజయః
క్వచిద్విచిత్రం జలయంత్రమందిరం,
మణిప్రకారాః సరసం చ చందనం
శుచౌ ప్రియే యాంతి జనస్య సేవ్యతామ్. 2

టీ. ప్రియే=ప్రియురాలా! క్వచిత్ = ఒకానొకచోట, శశాం... జయః—శశాంక = చంద్రునిచేత, క్షత = పోఁగొట్టఁబడిన, నీలరాజయః = నల్లని (చీకటియొక్క) చాల్పులుగల, నిశాః = రాత్రులును, (క్వచిత్) విచిత్రం = వింతయగు, జలయంత్రమందిరం = ఉదకధారాయంత్రములు గల గృహమును, (క్వచిత్) మణిప్రకారాః = రత్నవిశేషములును (అనఁగా శీతలములగు చంద్రకాంతమౌక్తికాది రత్నములును), (క్వచిత్) సరసం = ద్రవ

* ఈ యర్థము శాకుంతలమున "సుభగసలిలావగాహాః పాటలసంసర్గ సురభివనవాతాః, ప్రచ్ఛాయసులభనిద్రాదివసాః పరిణామరమణీయాః" అనఁగా జలములయం దవగాహనము మిగులసుఖముగ నుండుననియు పాటలపుష్పముల మీదినుండివచ్చు వాయువులు సుగంధములయి వీచుచున్నవనియును నీడపట్టు సుఖముగా నిద్రపట్టుననియును సాయంకాలమయినది మొదలు దినములు రమణీయములుగా నుండుననియును వర్ణింపఁబడియున్నది.

మైన, చందనం = చందనపంకమును, జనస్య=జనమునకు, సేవ్యతాం=సేవింపఁదగి యుండుటను, యాంతి = పొందుచున్నవి.

తా. కాంతామణీ! ఈ గ్రీష్మకాలమున రాత్రులయందు హాయిగా వెన్నెల గాయుచుండఁగా విహారము సేయుట యెంత వేడుకగా నుండును. పగటివేళలయందు వింతవింతలుగ కల్పింపఁబడిన జలయంత్రములు గల యిండ్ల యందు చల్లఁదనమెంత యాప్యాయిత నిచ్చుచున్నది. చంద్రకాంతములు మొదలగు మణులు శయనాదులకును ముత్యములు మొదలగునవి ధారణాదులకు నెంత సుఖకరముగ నున్నవి; కర్పూరాది మిశ్రితమైన చందనపంకము తాపమును దీర్చి యానందము గల్గించుచున్నయది. ఇట్టి సుఖములు వేఱొక సమయమున లభింపవని తాత్పర్యము.

శ్లో. సువాసితం హర్మ్యతలం మనోహరం
ప్రియాముఖోచ్ఛ్వాసవికంపితం మధు,
సుతంత్రిగీతం మదనస్య దీపనం
శుచౌ నిశీథేఽనుభవంతి కామినః. 3

టీ. కామినః = కాముకులు, శుచౌ = గ్రీష్మకాలమందు, నిశీథే = అర్ధరాత్రియందు, సువాసితం = మంచివాసన గలిగింపఁబడినదై, మనోహరం = రమణీయమైన, హర్మ్యతలం= మేడపైభాగమును, ప్రియా...మ్పితం- ప్రియా= ప్రియురాలియొక్క, ముఖ = వక్త్రముయొక్క, ఉచ్ఛ్వాస=నిట్టూర్పుచేత, వికంపితం=కదలింపఁబడిన, మధు=మద్యమును, మదనస్య=కామమునకు, దీపనం= ఉద్దీపకమగు, సుతంత్రిగీతం=మంచితంతెలుగల (వీణలు మొదలగు) వానితోడి పాటను, అనుభవంతి = అనుభవించుచున్నారు.

తా. గ్రీష్మకాలమునందు సుఖము ననుభవింపఁ గోరువారికి అనుకూలములైన యుపాయము లేవి యనఁగా నిర్మలమై చిత్రాలంకారాదులచేత నందమై సుధూపాదులచేత సుగంధమై పరిశుద్ధమైనగాలి వీచుటకనుకూల మగు మేడయును, శ్రమను దీర్చునదియై మనమునకు నుల్లాసము గలిగించి గ్రీష్మముచేతఁ

కలిగిన బలహీనతను బోఁగొట్టి రతిసుఖము నిచ్చునదియై ప్రియురాలితోఁ గూడి గ్రోలఁబడు మద్యము, అట్లు హాయిగానుండుసమయమున శ్రోత్రసుఖముగా వినఁబడు వీణాదులగానము, ఇవి యీసమయమున సుఖమును గలిగించునవి.

శ్లో. నితంబబింబైస్సుదుకూలమేఖలైః
స్తనైః సహారాభరణైః సచందనైః
శిరోరుహైః స్నానకషాయవాసితైః
స్త్రియో నిదాఘం శమయంతి కామినామ్. 4

టీ. స్త్రియః = స్త్రీలు, సుదుకూలమేఖలైః = వెలిపట్టుకోఁకలతోడను మొలనూళ్లతోడను గూడిన, నితంబబింబైః = వర్తులములయిన పిఱుఁదులచేతను, సహారాభరణైః = ముత్యాలహారములతోడను నిష్కములసవరము మొదలగు (బంగారునాణెముల దండలు) మొదలగునట్టి యాభరణములతోడను గూడినవియు, సచందనైః = చందనముతోఁగూడిన, స్తనైః= స్తనములచేతను, స్నానకషాయవాసితైః = స్నానముచేయునపుడు (చమురువదలుటకుపులుముకొనునట్టి) పరిమళయుక్తములైన ఒగరువస్తువులచేత సువాసనగలిగిన, శిరోరుహైః=కురులచేతను, కామినాం = కాముకులకు, నిదాఘం= వెట్టను, శయమంతి = పోఁగొట్టుచున్నారు.

తా. ఈగ్రీష్మకాలమునందు తమప్రియురాండ్రతోఁగూడినకాముకుల మనంబునకు నుల్లాసముగలిగించు నాయువతీమణుల పృథునితంబములయందు పొందుగులుకు వెలిపట్టుకోఁక విశదశితమగుచు వెలుంగ ఆ చీరపైని మణిమయములగు మొలనూలు మఱింత మనోహరమై ప్రకాశింప ఆనందసందోహ నిధానములో యనఁదగి స్మరణమాత్రంబున నుల్లంబులఁ జల్లుమనం జేయం జాలు తరుణీమణి కుచకలశములు "వటచ్ఛాయా కూపజలం తాంబూలం తరుణీస్తనం, శీతకాలే భవేదుష్ణ ముష్ణకాలేతు శీతలం" అనునట్లు సుఖశీతలములై కర్పూరమిశ్రితమైన చందనపంకలేపముచేఁ జిత్తంబును చిత్తజాయత్తంబుఁ గావింపుచు, ముక్తాహారాది భూషణ భూషితములై మిలిమిలి ఱిన మోహనంపు చక్కందనమున నయనములకు సాఫల్యము గలిగింప స్నానీయసువాసితములయి

మోముపై చలించుశిరోజములు తత్స్వేదోన్మీలిత మైనసరసీరుహాముపై మునరు కొదము తేంట్లయందము నందుచుండ నీకనిదాఘు (వెట్టదనము) మననెట్టిది, అట్లనుభవించువారి సుఖంబుకన్న వేరొండు సుఖము గలదే ?

శ్లో. నితాంతలాక్షారసరాగరంజితై-
ర్నితంబినీనాం చరణైః సనూపురైః,
పదేపదే హంసరుతానుకారిభి-
ర్జనస్య చిత్తం క్రియతే సమన్మథమ్. 5

టీ. నితాం...జితైః-నితాంత=మిక్కిలి, లాక్షారస = లత్తుకయొక్క, రాగ=ఎఱుపుచేత, రంజితైః = రంగుచేయఁబడినవై, సనూపురైః = అందెలతోఁ గూడికొనినవై, పదేపదే=అడుగడుగునందును, హంసరుతానుకారిభిః=హంసల ధ్వనిననుకరించుచున్న, చరణైః=పాదములచేత, జనస్య=జనముయొక్క, చిత్తం= మనస్సు, సమన్మథం = కామముతోఁ గూడినదిగా, క్రియతే = చేయఁబడు చున్నది.

తా. లత్తుకచేత పారాణింపఁబడి మిగుల నెఱ్ఱనై అందెలను దాల్చి యున్నవై యడుగడుగునకు సంచలరాయిడిని జేయుచున్నతరుణుల పాదము లను జూచినట్టైన వలపు కలుగనివారెవరు గలరు ?

అవ; నాల్గవశ్లోకమునఁ జెప్పినయర్థము ననువదించుచు నట్టి వస్తుసౌంద ర్యము కాముకులకుమాత్రమే గాక సర్వరసికులకును స్పృహణీయమయిన దని తెల్పుచున్నాఁడు.—

శ్లో. పయోధరా శ్చందనపంకచర్చితా-
స్తుషారగౌరార్పితహారశేఖరాః,
నితంబదేశాశ్చ సహేమమేఖలాః
ప్రకుర్వతే కస్య మనో న సోత్సుకమ్. 6

టీ చందనపంకచర్చితాః = చందనపుద్రవముచేత పూయఁబడినవై, తుషారగౌరార్పితహారశేఖరాః = మంచువలె తెల్లఁగానుండిన ముత్యాలహారము

లను దాల్చిన, పయోధరాః=స్తనములును, సహేమమేఖలాః=బంగారు మొలనూళ్లతోఁగూడిన, నితంబదేశాః=పిఱుఁదులును, కస్యమనః=ఎవనియొక్క మనస్సును, సోత్సుకం = వేడుకతోఁగూడినదానినిగా, నప్రకుర్వతే = చేయవు? (ఎల్లరమనసులను సోత్సుకములనుగాఁ జేయును.)

తా. చందనము నలంది ముత్తియములసరంబుల నలంకరింపఁబడిన తరుణులయొక్క స్తనకలశములును, బంగారుమొలనూలుతో నొప్పుచున్న పిఱుఁదులును ఎవ్వరిమనసున కింపు గాకుండును?

శ్లో. సముద్గతస్వేదజితాంగసంధయో
విముచ్య వాసాంసి గురూణి సాంప్రతం,
స్తనేషు తన్వంశుకమున్నతస్తనాః
నివేశయంతి ప్రమదాస్సయౌవనాః. 7

టీ. సముద్గతస్వేదజితాంగసంధయః - సముద్గత = పైకివెడలిన, స్వేద = చెమటచేత, జిత=జయింపఁబడిన, అంగసంధయః=(బాహుమూలము మొదలగు) అవయవసంధులుగలవారై, సయౌవనాః = యౌవనముతోఁగూడికొనినవారై, ఉన్నతస్తనాః = ఎత్తైనకుచములుగల, ప్రమదాః = మదవతులు, సాంప్రతం = ఇప్పుడు, గురూణి=దట్టములై బరువైన, వాసాంసి = వస్త్రములను, విముచ్య = విడిచి, స్తనేషు=స్తనములయందు, తను=సూక్ష్మమైన, అంశుకం = వస్త్రమును, నివేశయంతి=ఉంచుచున్నారు.

తా. ఈ సమయమునందు యువతులు చిక్కనివలువలను వదలి మిగుల పలుచనివలువలను తమకుచకలశముల నలంకరించుకొనుచున్నారు.

శ్లో. సచందనాంబువ్యజనోద్భవానిలైః
సహారయష్టిస్తనమండలార్పణైః
సవల్లకాకలిగీతనిస్వనై -
ర్విబోధ్యతే సుప్త ఇవాద్య మన్మథః. 8

టీ. సచం...నిలైః, సచందనాంబు=చందనోదకముతోఁగూడిన (చందన ద్రవముతోఁగూడిన), వ్యజన=విసనకఱ్ఱలవలన, ఉద్భవ = పుట్టిన (విసనకఱ్ఱలు వీచుటచేతఁ గలిగిన), అనిలైః=వాయువులచేతను, సహా...ర్పణైః=సహారయష్టి=ముత్యాలపేరుతోఁగూడిన, స్తనమండల=వర్తులములయిన కుచములయొక్క, అర్పణైః=ఇచ్చుటలచేత, సవ...స్వనైః=సవల్లకీకాకలిగీత = వీణెలయొక్క సూక్ష్మమై అవ్యక్తమధురమైన పాటలతోఁగూడిన, నిస్వనైః = (గాయకులయొక్క కంఠగానముల) ధ్వనులచేతను, అద్య=ఇప్పుడు, మన్మథః = మన్మథుఁడు సుప్త ఇవ=నిద్రించినవానివలె, విబోధ్యతే= మేలుకొల్పఁబడుచున్నాఁడు.

తా. చందనద్రవసిక్తములగు వీవనలంబుట్టు వాయువులును, ముత్తెముల పేరులం బొంగారు జవరాండ్ర గబ్బిగుబ్బల కౌఁగిలింతలును, కర్ణరసాయనంబులగు వల్లకీరవంబులును, నిద్రసెందుచున్న మన్మథుని మేలుకొలుపుచున్నట్లున్నవి. (అనఁగా మన్మథోద్దీపకములై యున్నవి.

శ్లో. సితేషు హర్మ్యేషు నిశాసు యోషితాం
సుఖప్రసుప్తాని ముఖాని చంద్రమాః,
విలోక్య నూనం భృశముత్సుకశ్చిరం
నిశాక్షయే యాతి హ్రియేవ పాండుతామ్.　　9

టీ. చంద్రమాః=చంద్రుఁడు. నిశాసు=రాత్రులయందు, సితేషు=తెల్లనివియగు, హర్మ్యేషు=మేడలయందు, యోషితాం = స్త్రీలయొక్క, సుఖప్రసుప్తాని=సుఖముగానిద్రించుచున్న, ముఖాని = మోములను, చిరం = తడవుగా, విలోక్య=చూచి, భృశం=మిక్కిలి, ఉత్సుకః=(ఈ స్త్రీముఖములవంటి యందము నాకులేకపోయెనేయని మనంబున) ఔత్సుక్యముగలవాఁడై, నిశాక్షయే = రాత్ర్యంతమునందు, హ్రియేవ = లజ్జచేతనువలె, పాండుతాం= తెల్లఁదనమును యాతి=పొందుచున్నాఁడు.

తా. ఎండకాలమునందు మేడలమీఁద సుదనిద్రఁ జెందియున్న తరుణీమణుల మోములం గని చంద్రుఁడు తనకట్టి కాంతిలేదని మనంబున పాచబడి

సిగ్గుచేత తెల్లఁబోయినాఁడో యనునట్లు వేసవకాలమున కాంతిహీనుఁడై గన్పడును.

శ్లో. అసహ్యవాతోద్ధతరేణుమండలా
ప్రచండసూర్యాతపతాపితా మహీ,
న శక్యతే ద్రష్టుమపి ప్రవాసిభిః
ప్రియావియోగానలదగ్ధమానసైః. 10

టీ. అసహ్యా...మండలా-అసహ్యా=ఓర్వనశక్యమయిన, వాత=వాయువుచేత, ఉద్ధత=యెగురఁగొట్టఁబడిన, రేణు=దుమ్మునొక్క, మండలా = సమూహాముగలదియు, ప్రచం...పితా-ప్రచండ=తీక్ష్ణమైన, సూర్యాతప = యెండచేత, తాపితా = తపింపఁజేయఁబడిన, మహీ = భూమి, ప్రియా...నసైః-ప్రియా=ప్రియురాండ్రయొక్క, వియోగ = ఎడబాటనెడు, అనల=నిప్పుచేత, దగ్ధ=కాల్చఁబడిన, మానసైః = మనస్సులుగల, ప్రవాసిభిః = బాటసారులచేత, ద్రష్టుమపి=చూచుటకును, న శక్యతే=సాధ్యపడలేదు.

తా. ఈయెండకాలమునందు నిలువశక్యముగాకుండునట్లు బడమటిగాలి మిగుల వడిగా వీచుచున్నది. నేలమీఁది దుమ్ము పైకెగిరి దిగంతములం గ్రమ్ముచున్నది. ఎండ బహుతీవ్రముగా నుండుటఁజేసి భూమి మిక్కిలి వేఁడియైనది. యీసమయమునందు విదేశవాసము సేయుజనులు తమప్రియురాండ్రను విడిచి యుండుటచేత ఆవిరహాగ్ని మనసులను కాల్చుటయేగాక యెండచేత యింతకాలినభూమిఁ దేరిచూచుటకును పలుకుపడకున్నది గదా.

శ్లో. మృగాః ప్రచండాతపతాపితా భృశం
తృషా మహత్యా పరిశుష్కతాలవః,
వనాంతరే తోయమితి ప్రధావితా
నిరీక్ష్య భిన్నాంజనసన్నిభం నభః. 11

టీ. మృగాః=జింకలు, భృశం=మిక్కిలి, ప్రచ...పితా - ప్రచండ = తీక్ష్ణమయిన, ఆతప=ఎండచేత, తాపితాః=తపింపఁజేయఁబడినవై, మహత్యా =

గొప్పదయిన, తృషా=దప్పిచేత, పరి...తాలవః-పరిశుష్క=యెండిన,తాలవః= దౌడలుగలవై, వనాంతరే=అడవినడుమ, భిన్నాంజనసన్నిభం = మెదగనూరిన కాటుకతోసమానమయిన, నభః = ఆకాశమును, నిరీక్ష్య = చూచి, తోయ మితి=ఉదకమని, ప్రధావితాః=పరుగెత్తినవి.

తా. జింకలు చుఱుకైనయెండచేతను వడిగా వీచునట్టిపడమటిగాలిచే తను మిగుల తాపమును పొందినవై మిక్కిలి దప్పిచేత నాలుకయు దౌడలు నారిపోఁగా అడవియెడారులయందు కొంచెముపల్లముగల ప్రదేశముల నల్లని లేటకాంతి గలయాకాశమును (ఎండమావులను)ఉదకమనియెంచి పరుఁగిడు చున్నవి.

శ్లో. సవిభ్రమైః సస్మితజిహ్మవీక్షితై-
ర్విలాసవత్యో మనసి ప్రవాసినామ్,
అనంగసందీపనమాశు కుర్వతే
యథా ప్రదోషాః శశిచారుభూషణాః.　　12

టీ. విలాసవత్యః=విలాసముగలస్త్రీలు, శశిచారుభూషణాః = చంద్రుఁ డనెడు అలంకారముగల, ప్రదోషాఃయథా = సంధ్యవేళలవలె. సవిభ్రమైః = విలాసముతోఁగూడుకొనిన, సస్మి...క్షితైః-సస్మిత = చిఱునగవుతోఁ గూడు కొన్న, జిహ్మ=కుటిలములయిన, వీక్షితైః=చూపులచేత ప్రవాసినాం = విరహి జనులయొక్క, మనసి = మనస్సునందు, అనంగసందీపనం = కామోద్దీపనమును కుర్వతే=చేయుచున్నారు.

తా. ఈసమయమందు సాయంకాలములు చంద్రునిచేఁ బ్రకాశించు నట్లు విలాసయుక్తములైన చూపులచేతను చిఱునగవులచేతను వెలయునట్టిజవరాం డ్రను గని విదేశమునందు నొంటరిగ సంచరించుబాటసారులకును మనసుచ వలవంత మిగులుచున్నది గదా.

శ్లో. రవేర్మయూఖైరభితాపితో భృశం
విదహ్యమానః పథి తప్తపాంసుభిః,

అవాఙ్ముఖో జిహ్మగతిశ్శ్వసన్ ముహుః
ఫణీ మయూరస్య తలే నిషీదతి. 13

టీ. రవేః=సూర్యునియొక్క, మయూఖైః = కిరణములచేత, భృశమ్ = మిక్కిలి, అభితాపితః = మిక్కిలితాపము నొందింపఁబడినదై, పథి = మార్గమందు, తప్తపాంసుభిః = కాలినదుమ్ముచేత, విదహ్యమానః = మిక్కిలి కాల్పఁబడినదై, అవాఙ్ముఖః = తలవంచుకొన్నదై, జిహ్మగతిః = వంకరగాఁ బోవుచున్నదై, ముహుః = మాటిమాటికి, శ్వసన్ = నిట్టూరుపువిడుచుచున్నదైన, ఫణీ = పాము, మయూరస్య = నెమిలియొక్క, తలే = పింఛముక్రింద, నిషీదతి = పడియున్నది.

తా. చూచితివే! యెండవేఁడిమికి తాళఁజాలక పాము నీడకుఁ బోఁబోయి కాలినదుమ్ములోఁ జేరి యొడలంతయుం గాలుచుండఁగా మిగుల కష్టముగా వచ్చి యాబాధచేత తనశత్రువనియుఁ జూడక నెమిలిపింఛపునీడను జేరి రొజుచు పడియున్నది. కష్టము యుక్తాయుక్తములఁ దెలియనీయదుగదా ?

శ్లో. తృషా మహత్యా హతవిక్రమోద్యమః
శ్వసన్ముహుర్దూరవిదారితాననః,
న హంత్యదూరేఽపి గజాన్ మృగేశ్వరో
విలోలజిహ్వశ్చలితాగ్రకేసరః. 14

టీ. మహత్యా = అధికమైన, తృషా = దప్పిచేత, హతవిక్రమోద్యమః=తనపరాక్రమప్రయత్నముపోయినదై, ముహుః = మాటిమాటికి, దూరవిదారితాననః=నోటిని మఱింత తెఱచుకొన్నదియుం, విలోలజిహ్వః = నాలుకనాడించుచున్నదియుం, చలితాగ్రకేసరః = ముందఱిజూలును విదలించుచున్నదైన,మృగేశ్వరః. సింహము, అదూరేఽపి=దగ్గరనుండినవైనను, గజాన్ = ఏనుఁగులను, న హంతి = చంపకున్నది.

తా. సింహము తానన్నిఁటిని హింసించునట్టి పరాక్రమము గలదైనను తనకు కేవలము విరోధులుగనుండు నేనుఁగులు తనచేరువ నున్నను వానిజోలికిఁ

బోకయున్నది. మిక్కిలి దప్పిఁగొని నోరుతెఱచుకొని నాలుక నాడించుచు రోజుచున్నది. ఎండతాపము స్వాభావికచేష్టను సైతము చేయరానీయకున్నది. ఎంతవాఁడైనను రాగలకష్టమువచ్చినప్పుడు లోఁబడిపోవుచున్నాఁడు.

శ్లో. విశుష్కకంఠాహృతశీకరాంభసః
　గభస్తిభిర్భానుమతోఽనుతాపితాః,
　ప్రవృద్ధతృష్ణోపహతా జలార్థినో
　న దంతినః కేసరిణోఽపి బిభ్యతి. 15

టీ. విశుష్క = ఎండిన, కంఠ = కంఠముచేత, ఆహృత = తీసికొనఁబడిన, శీకరాంభసః = చల్లని యుందకముగలవియు, భానుమతః = సూర్యుని యొక్క, గభస్తిభిః=కిరణములచేత, అనుతాపితాః = మిక్కిలితపింపఁజేయఁబడినవై, ప్రవృద్ధ=వృద్ధిఁ బొందిన, తృష్ణ = దప్పిచేత, ఉపహతాః = బాధింపఁబడినవై, జలార్థినః = నీటిని గోరుచున్న, దంతినః = ఏనుఁగులు, కేసరిణోఽపి= సింహామువలనను, న బిభ్యతి = భయపడకున్నవి.

తా. ఏనుఁగులు గొంతులెండి తొండమునందలికొంచ పాటినీటిబిందువులతో గొంతులఁదడుపుకొనుచు, సూర్యకిరణముల వేఁడిమికి మఱింత తాపము నొంది దప్పిఁగొని నీరెక్కడ దొరకునా యని చూచుచు సింహములు వచ్చినను భయపడకున్నవి.

శ్లో. హుతాగ్నికల్పైస్సవితుర్గభస్తిభిః
　కలాపినః క్లాంతశరీరచేతసః,
　న భోగినం ఘ్నంతి సమీపవర్తినం
　కలాపచక్రేషు నివేశితాననమ్. 16

టీ. సవితుః = సూర్యునియొక్క, హుతాగ్నికల్పైః = వ్రేల్చఁబడిన యగ్నితో సమానములైన, గభస్తిభిః = కిరణములచేత, క్లాంత = వాడిన, శరీర చేతసః = శరీరముమనసుకలవియు (అనఁగా ఎండవేఁడిమిచేత దేహమువాడినది.

మనసునొచ్చినదనియర్థము.)కలాపినః = నెమిళ్లు, సమీపవర్తినం=చేరువనున్నదై, కలాపచక్రేషు = పింఛములందు, నివేశితాననం = మోమునువైచుకొనియున్న, భోగినం = పామును, న ఘ్నంతి = చంపకున్నవి.

తా. నెమిళ్లు ఎండవేడిమిచేత మిగుల శ్రమనొందినవై తమకు శత్రువులయినను తమమీఁద వచ్చి పడినవైనను పాములను పరికింపకున్నవి.

శ్లో.సభద్రముస్తం పరిశుష్కకర్దమం
సరః ఖనన్నాయతపోత్రమండలైః,
రవేర్మయూఖైరభితాపితో భృశం
వరాహయూథో విశతీవ భూతలమ్. 17

టీ. సభద్రముస్తం=భద్రముస్తలతోఁగూడినదియు, పరిశుష్కకర్దమం = ఎండినబురదగలదియునగు, సరః = పడియను, ఆయతపోత్రమండలైః = పొడవులైనముక్కుకొళ్లచేత, ఖనన్ = త్రవ్వుచున్నదై, రవేః = సూర్యునియొక్క, మయూఖైః=కిరణములచేత, భృశం=మిక్కిలి, అభితాపితః = మిగుల వేఁడిని కలిగింపఁబడిన, వరాహయూథః = అడవిపందులగుంపు, భూతలం = భూప్రదేశమును, విశతీవ=ప్రవేశించుచున్నట్టున్నది.

తా. అడవిపందులగుంపు భద్రముస్తలనుఎత్తుటకు ముక్కుముట్టెలతో పడియలను త్రవ్వుచుండఁగా ఎండకు తాళఁజాలక భూమిలో చొరఁబోవుచున్నట్టున్నవి.

శ్లో.వివస్వతా తీక్ష్ణతరాంశుమాలినా
సపంకతోయాత్సరసోఽభితాపితః,
ఉత్ప్లుత్య భేకస్తృషితస్య భోగినః
ఫణాతపత్రస్య తలే నిషీదతి. 18

టీ. తీక్ష్ణతరాంశుమాలినా-తీక్ష్ణతర = మిక్కిలిచురుకయిన, అంశుమాలినా =కిరణసమూహముగల, వివస్వతా=సూర్యునిచేత, అభితాపితః = మిక్కిలి తపింపఁజేయఁబడిన, భేకః = కప్ప, సపంకతోయాత్ = బురదనీళ్లతోఁగూడు

కొన్న, సరసః=కొలఁకునుండి, ఉత్ప్లుత్య=యెగిరి, తృషితస్య = ఆఁకలిఁగొనిన, భోగినః=సర్పముయొక్క, ఫణాతపత్రస్య=గొడుగువంటిపడిగెయొక్క, తలే = క్రిందిభాగమందు, నిషీదతి=కూర్చున్నది.

తా. ఎండ మిక్కిలి తీక్ష్ణముగాఁ గాయుచుండఁగా పడియలోని నీరు ఇగిరిపోయి కొంచెముగా నిలిచి యెండచేత క్రాగుచున్నది. బురదవంటి వేఁడి నీళ్లయందు నిలువలేక కప్ప యొకటి దప్పిగొనియుండిన, పాముపడగయొక్క నీడయందు యెగిరి పడినది. (అనఁగా తాపముగొనియుండుటచేత కప్ప పాము తనను మ్రింగు నని యెంచలేదు. పాము దప్పిగొనియుండుటచే కప్పను గమనింపలేదు.)

శ్లో. సముద్ధృతాశేషమృణాళజాలకం
విపన్నమీనం ద్రుతభీతసారసం,
పరస్పరోత్పీడనసంహతైర్గజైః
కృతం సరః సాంద్రవిమర్దకర్దమమ్. 19

టీ. పర...సంహతైః-పరస్పర = ఒకదానితో నొకటి, ఉత్పీడన=త్రోయుటయందు, సంహతైః = తాఁకుచున్న, గజైః=ఏనుఁగులచేత, సరః=కొలను, సము...లకం-సముద్ధృత=పెళ్లగింపఁబడిన, అశేష = సమస్తమయిన, మృణాల జాలకం=తామరతూండ్ల సమూహముగలదిగను, విపన్నమీనం = నశించినమీనములు గలదిగను, ద్రుతభీతసారసం-ద్రుతభీత=భయపడిపరుగిడిన, సారసం = బెగ్గురుపక్షులు గలదియుఁ, సాంద్రవిమర్దకర్దమం-సాంద్ర=దట్టముగా, విమర్ద = నలుగుడుగల, కర్దమం=బురదగలదిగను, కృతం=చేయఁబడినది.

తా. ఏనుఁగులు మడుగునఁ బ్రవేశించి యొకదాని నొకటి త్రోసికొనుచు తామరతీగల నన్నిటిని పెకలించి వేసెను. మత్స్యములు బురదలో త్రొక్కఁబడి నశించెను. జలపక్షులు భయపడి చెదరి పాఱిపోయెను. నీళ్లును బురదయుం కలసి మెదిగి రొంపి అయినది. దీనివలన మూఢజనులు అన్యోన్యము విహారము సేయుటయు మనస్విజనుల కాపత్కరమని అర్థము తోఁచుచున్నది.

శ్లో. రవిప్రభోద్భిన్నశిరోమణిప్రభో
విలోలజిహ్వాద్వయలీఢమారుతః,
విషాగ్నిసూర్యాతపతాపితః ఫణీ
న హంతి మండూకకులం తృషాకులః. 20

టీ. రవి... ప్రభః-రవిప్రభ = ఎండచేత, ఉద్భిన్న = పైకివ్యాపించుచున్న, శిరోమణి=శిరోరత్నముయొక్క, ప్రభః=(తేజస్సువంటి) తేజస్సుకలది యును, విలోల...రుతః-విలోల-చంచలమయిన, జిహ్వాద్వయ = రెండునాలుకల చేత, లీఢ=నాకఁబడిన, మారుతః=గాలిగలదియును, విషా.. పితః-విష = విషము చేతను, అగ్ని = దావాగ్నిచేతను, సూర్యాతప=యెండచేతను,తాపితః = తపింప చేయఁబడినదియును, తృషాకులః=దప్పిచేతతొట్రుపడుచున్నదియును(నగు), ఫణీ= సర్పము, మండూకకులం=కప్పలమొత్తమును, న హంతి=చంపకున్నది.

తా. పాము ఎండచే మిక్కిలి వెలుఁగుచున్న శిరోరత్నమును దాల్చి రెండు నాలుకలచేత గాలిని పీల్చుకొనుచు తనవిషముచేతను కార్చిచ్చుమంటల చేతను ఎండవేఁడిమిచేతను మిగులతపించుచున్నదై దప్పిగొని యుండఁగా కప్పలు తనను చేరవచ్చినను చంపనెంచకున్నది. (అనఁగా అనేకసంకటములు పడువానికి స్వాభావికములయిన కార్యములు సయితము తోఁచకుండునని భావము.)

శ్లో. సఫేనలోలాయతవక్త్రసంపుటం
వినిస్సృతాలోహితజిహ్వమున్ముఖం,
తృషాకులం నిస్సృతమద్రిగహ్వరా-
దవేక్ష్యమాణం మహిషీకులం జలమ్. 21

టీ. సఫేన...సంపుటం - సఫేన = నురుగుతోకూడుకొనిన, లోల = చంచలమయిన, ఆయత=పొడవైన, వక్త్రసంపుటం = నోరుగలదియును, విని... జిహ్వ—వినిస్సృత = నోటివెలుపలికివచ్చిన, ఆలోహిత = కొంచెము మెఱ్ఱనైన, జిహ్వం=నాలుకగలదియును, ఉన్ముఖం=యెత్తినముఖముగలదియును, తృషాకులం= దప్పిచేత తొట్రుపడునదియును, జలం=ఉదకమును, అవేక్ష్యమాణం = చూచు

చున్నదైన, మహిషీకులం = బఱ్ఱెలగుంపు, అద్రిగహ్వరాత్ = కొండగుహ నుండి, వినిస్సృతం=వెడలివచ్చినది.

తా. యెనుములగుంపు చల్లని వేళలఁ గొండగుహలలోఁ బండుకొనియుండి మిక్కిలి యెండబడిన వేళకు తాపమును సహింపలేక నురుగుతోడి జొల్లుకారుచుండఁగా పొడవైననోళ్లు తెరుచుకొని యెఱ్ఱనైన నాలుకలు వెళ్లవెట్టుకొని దప్పిచే నారాటపడుచుండినదై యిటునటు జలమును వెదకుకొనుచు కొండగుహనుండి బారులుకట్టి వచ్చుచున్నది.

శ్లో. పటుతరదవదాహోచ్ఛుష్కసస్యప్రరోహాః
పరుషపవనవేగోత్క్షిప్తసంశుష్కపర్ణాః,
దినకరపరితాపక్షీణతోయాస్సమన్తా
ద్విదధతి భయముచ్చైర్వీక్ష్యమాణా వనాన్తాః. 22

టీ. పటుతర .. రోహాః-పటుతర=మిక్కిలిగొప్పదైన, దవదాహ = దావాగ్ని కాల్చుటచేత, ఉచ్ఛుష్క=మిక్కిలియెండిన, సస్యప్రరోహాః = పయిరుమొలకలుగలదియు పరుష...పర్ణాః-పరుష=కఠినముగా వీచునట్టి, పవన = గాలియొక్క, వేగ=వడిచేత, ఉత్క్షిప్త=యెగరగొట్టఁబడిన, సంశుష్కపర్ణాః = యెండుటాకులు గలవియు, సమంతాత్=అంతట, దినకర ..తోయాః-దినకర=సూర్యునియొక్క, పరితాప=వేఁడిమిచేత, క్షీణాః=క్షయించిన, తోయాః = ఉదకములు గలవియు, ఉచ్చైః=యెత్తుచోట్లనుండి, వీక్ష్యమాణాః = చూడఁబడుచున్న, వనాంతాః=అరణ్యప్రదేశములు భయం=భయమును, విదధతి=చేయుచున్నవి.

తా. కారుచిచ్చు మంటలచేత పయిరులు పచ్చికలు మాడిపోవుచున్నవి. వడిగా వీచునట్టిగాలిచేత యెండుటాకు లెగిరిపోవుచున్నవి. ఎక్కడ చూచినను యెండచేత జలమంతయుం పీల్చఁబడినది. ఇట్లు వనప్రదేశములు చూచుటకు భయము కలుగుచున్నది.

శ్లో. శ్వసితి విహగవర్గః శీర్ణపర్ణద్రుమస్థః
కపికులముపయాతి క్లాంతమద్రేర్నికుంజం,

భ్రమతి గవయయూథః సర్వత స్తోయమిచ్ఛన్
శరభకులమజిహ్మం ప్రోద్ధరత్యంబు కూపాత్. 23

టీ. శీర్ణపర్ణద్రుమస్థః = ఎండుటాకులచెట్టుమీఁదనుండిన, విహగవర్గః = పక్షులగుంపు, శ్వసితి=ఆరాటముచేత నిశ్వాసమునువిడుచుచున్నది. క్లాంతం = బడలిన, కపికులం=కోఁతులగుంపు, అద్రేః = పర్వతముయొక్క, నికుంజం = పొదరింటిని. ఉపయాతి = చేరుచున్నది, గవయయూథః = గురుపోతులగుంపు, తోయం=నీటిని, ఇచ్ఛన్=కోరుచున్నదై, ఇత స్తతః=ఇటునటు, భ్రమతి = తిరుగుచున్నది, అజిహ్మం=కుటిలముగాని, శరభకులం=శరభములగుంపు, కూపాత్ = బావినుండి, అంబు=ఉదకమును, ప్రోద్ధరతి=యెత్తుకొనుచున్నవి.

తా. పక్షులెండుటాకుల చెట్లమీఁదనుండి దప్పిగొని ఆయాసపడుచున్నవి. కోఁతులెండ వేఁడిమికి తాళఁజాలక కొండమీఁదిపొదలలోఁ జేరుచున్నవి. గురుపోతులు నీటికై యిటునటు తిరుగుచున్నవి. శరభములు ఱెక్కలుగలవి కావున లోఁతైనబావులయందున్న నుదకమును తీసుకొనుచున్నవి.

శ్లో. వికచనవకుసుంభస్వచ్ఛసిందూరభాసా
ప్రబలపవనవేగోద్భూతవేగేన తూర్ణమ్,
తటవిటపిలతాగ్రాలింగనవ్యాకులేన
దిశిదిశి పరిదగ్ధా భూమయః పావకేన. 24

టీ. వికచ...భాసా - వికచ = వికసించిన నవ = నూతనమైన, కుసుంభ = కుసుంబా పూవువలె, స్వచ్ఛ = నిర్మలమైన, సిందూరభాసా = సిందూరముయొక్క కాంతివంటి కాంతిగలదియు, ప్రబల...గేన...ప్రబల = అధికమైన, పవన = గాలియొక్క, వేగ=వడిచేత, ఉద్భూత=పుట్టిన, వేగేన = వడిగలదియు,తట...కులేన - తట=ఒడ్డునందలి, విటపి = చెట్లయొక్క, లతాగ్ర = కొనకొమ్మలను, ఆలింగన = తాకుటయందు, వ్యాకులేన = తొందరపడుచున్నదియునగు, పావకేన = కార్చిచ్చుచేత, దిశిదిశి = ప్రతిదిక్కునం

దును. తూర్ణమ్ = శీఘ్రముగా, భూమయః = ప్రదేశములు, పరిదగ్ధాః = మిక్కిలి దహింపఁబడినవి.

తా. కార్చిచ్చు సిందూరమువలె నెఱ్ఱగా మండుచున్నదై వడిగా వీచు నట్టిగాలిచేత మఱింత వృద్ధిఁబొందిచెట్లకొనకొమ్మలు తాకునట్లు మండుచున్నదై యతిశీఘ్రముగా సకలదిక్కులు వ్యాపించి కాల్చుచున్నది.

శ్లో. జ్వలతి పవనవృద్ధః పర్వతానాం దరీషు
స్ఫుటతి పటునినాదైః శుష్కవంశస్థలీషు,
ప్రసరతి తృణమధ్యే లబ్ధవృద్ధిః క్షణేన
గ్లపయతి మృగవర్గం ప్రాంతలగ్నో దవాగ్నిః. 25

టీ. పవనవృద్ధః=వాయువుచేత వృద్ధిబొందిన, దవాగ్నిః = కార్చిచ్చు, పర్వతానాం=పర్వతములయొక్క, దరీషు=లోయలయందు, జ్వలతి = మండుచున్నది. శుష్కవంశస్థలీషు=ఎండిన వెదుళ్లచోట్లయందు, పటునినాదైః=కఠినమయిన మ్రోఁతలతో, స్ఫుటతి=విరియుచున్నది, క్షణేన=క్షణములోపల, లబ్ధవృద్ధిః=హెచ్చుపెరిగినదై, తృణమధ్యే=కసవునడుమ, ప్రసరతి=వ్యాపించుచున్నది. ప్రాంతలగ్నః=పార్శ్వములయందంటుచున్నదై, మృగవర్గం = లేళ్లగుంపును, గ్లపయతి=కష్టపెట్టుచున్నది,

తా. దావాగ్ని గాలిచేత వృద్ధిఁబొంది కొండచరులయందు మండుచున్నది. వెదురుగుమ్ములలోచేరి పెటపెటధ్వనులతో వెదుళ్లనుపగల్చుచున్నది. ఎండిపోయిన కసవుపొదలో క్షణమాత్రములో క్రమ్మి భగ్గుమని మండుచున్నది. లేళ్లగుంపునకుఁ దాకుచున్నదై వానిని వ్యాకులపఱుచుచున్నది.

శ్లో. బహుతర ఇవ జాతః శాల్మలీనాం వనేషు
స్ఫురతి కనకగౌరః కోటరేషు ద్రుమాణామ్,
పరిణతదళశాఖానుత్పతన్ ప్రాంశువృక్షాన్
భ్రమతి పవనధూతః సర్వతోఽగ్నిర్వనాన్తే. 26

టీ. అగ్నిః=నిప్పు, శాల్మలీనాం=బూరుగచెట్లయొక్క, వనేషు = వనము లందు, హాంతర ఇవ=మిక్కిలి అధికముగా, జాతః = పుట్టినది. ద్రుమాణాం = చెట్లయొక్క, కోటరేషు=తొఱ్ఱలయందు, కనకగౌరః=బంగారువలె పచ్చనిదై, స్ఫురతి=ప్రకాశించుచున్నది, పరిణతదలశాఖాన్=పండుటాకుల కొమ్మలుగల, ప్రాంశువృక్షాన్ = ఎత్తుచెట్లను, ఉత్పతన్ = ఎగిరియంటుచున్నదై, పవన ధూతః=గాలిచేత వీవఁబడినదై. సర్వతః = అంతట, భ్రమతి=తిరుగుడు పడు చున్నది.

తా. అగ్ని బూరుగచెట్లలోఁ బుట్టి చెట్లతొఱ్ఱలలో మండుచు ఆకులు రాలు చున్న మ్రాకులకంటుచు పెనుగాలిచే ప్రజ్వరిల్లి సకలదిక్కులను వ్యాపించు చున్నది.

శ్లో. గజగవయమృగేంద్రా వహ్నిసంతప్తదేహాః
సుహృద ఇవ సమేతా ద్వంద్వభావం విహాయ,
హుతవహపరిఖేదాదాశు నిర్గత్య కక్షా
ద్విపులపులినదేశాం నిమ్నగాం సంవిశన్తి. 27

టీ. వహ్నిసంతప్తదేహాః = కార్చిచ్చుచేత వేఁడిమిగొనినదేహములుగలవై, ద్వంద్వభావం=విరోధమును, విహాయ=విడిచి, సుహృదఇవ=మిత్రులవలె, సమేతాః=కూడినవై, గజగవయమృగేన్ద్రాః=ఏనుఁగులును గురుపోతులును, సింహము లును, హుతవహపరిఖేదాత్ = కార్చిచ్చుచేత మిక్కిలి శ్రమగలిగిన, కక్షాత్ = కొండగవులనుండి నిర్గత్య=వచ్చి, విపులపులినదేశాం = విస్తారములయిన యిసుక దిన్నెలుగల, నిమ్నగాం=నదిని, సంవిశన్తి=చేరుచున్నవి.

తా. సింహములు మొదలైనమృగములు దావాగ్ని తాపమునకు నోర్వ లేక కొండగుహలనుండి వెలువడి సహజమయినవిరోధమును సయితము విడిచి పెట్టి గుంపులుకూడి వచ్చి నదీప్రాంతమును జేరుచున్నవి.

శ్లో. కమలవనచితాంబుః పాటలామోదరమ్యః
సుఖసలిలనిషేకః సేవ్యచంద్రాంశుహారః,

వ్రజతు తవ నిదాఘః కామినీభిః సమేతో
నిశి సులలితగీతే హర్మ్యపృష్ఠే సుఖేన. 28

టీ. సులలితగీతే=మిక్కిలిమనోహరమైన పాటగలదానా (ప్రేయసీ) ! కమలవనచితాంబుః-కమలవన=పద్మవనముచేత, చిత=వ్యాపింపఁబడిన, అంబుః= ఉదకముగలదియు, పాటలామోదరమ్యః=పాటల = కలిగొట్టుపూవులయొక్క, ఆమోద=పరిమళముచేత, రమ్యః=రమణీయమైనదియు, సుఖసలిలనిషేకః-సుఖ= సుఖకరమైన, సలిల=ఉదకమందు, నిషేకః=స్నానముగలదియు, సేవ్యచంద్రాంశు హారః-సేవ్య=సేవింపఁదగిన, చంద్రాంశు=చంద్రకిరణములును, హారః=ముత్యాల హారముగలదియు, కామినీభిః=స్త్రీలతో, సమేతః = కూడుకొనిన, నిదాఘః = గ్రీష్మఋతువు, నిశి=రాత్రియందు, హర్మ్యపృష్ఠే=మేడమీఁద, సుఖేన=సుఖ ముగా, వ్రజతు=గడచిపోవుఁగాక.

తా. ఈగ్రీష్మకాల మెండవేఁడిమిచేత నింతకష్ట మయినను మిక్కిలి సుఖకరము లయినవిషయము లున్నవి. కొలంకులయందు తామరలు వికసిల్లుచు నుదకము చల్లగానుండి వేఁడిమిని హరించుచున్నది. కలిగొట్టుపూవులవాసనలు మిగుల మనోహరము లయి క్రమ్ముచున్నవి. జలాశయములయం దవగాహనము మిగుల సుఖమయినది. ముత్యాలహారములును మల్లెపువ్వులదండలును వెన్నెలయును నాహ్లాదమును కలిగించుచున్నవి. రాత్రివేళల మేడలమీఁద నూర్చుండి కామినీజనములతోఁగూడి సంగీతప్రసంగములచే సుఖముగాఁ బ్రొద్దు పుచ్చ వచ్చును.

ఇది శ్రీమహాకవి కాళిదాసవిరచితమగు ఋతుసంహారకావ్యమున
గ్రీష్మర్తు వర్ణనంబను ప్రథమసర్గము.

# ద్వితీయసర్గము.

అవ. గ్రీష్మ ఋతువు ననువర్ణించిన యనంతరమున క్రమప్రాప్తమైన వర్ష ర్తువును వర్ణించుచున్నాఁడు.—

శ్లో. సశీకరాంభోధరమత్తకుంజర
స్తటిత్పతాకోఽశనిశబ్దమర్దలః,
సమాగతో రాజవదుద్ధతద్యుతి
ర్ఘనాగమః కామిజనప్రియః ప్రియే. 1

టీ. హే ప్రియే=ఓప్రియురాలా! సశీకర...కుంజరః-సశీకర=జలబిందువులతోఁగూడిన, అంభోధర=మేఘము లనియెడు, మత్తకుంజరః = మదపుటేనుఁగులు కలిగినదియు, తటిత్పతాకః-తడిత్ = మెఱుపులనియెడు, పతాకః = ధ్వజములుకలిగినదియు, అశని...మర్దలః - అశనిశబ్ద = ఉరుములధ్వనియనెడు, మర్దలః=మద్దెలకలిగినదియుఁ, ఉద్ధతద్యుతిః-ఉద్ధత=పెంపొందిన, ద్యుతిః=కాంతి కలిగినదియు, కామిజనప్రియః-కామిజన = కాముకులగు జనులకు, ప్రియః = ఇష్టమైన, ఘనాగమః = వర్షఋతువు, రాజవత్ = రాజువలె, సమాగతః = వచ్చెను.

తా. ఓప్రియురాలా! మహారాజులెచ్చటికైనను వెడలు నప్పుడు మదజలము స్రవింపుచుండుతుండములు గలిగినమదపుటేనుఁగులఁ గొనిపోవునట్లు వర్షఋతువు- జలబిందువుల స్రవించుచుండు మేఘములతోఁ గూడియున్నది. వారు చిత్రవర్ణంబులగుటెక్కెములనెత్తునట్లు ఇది మెఱుపులఁ బ్రసరింపఁ జేయుచున్నది. వారు మర్దలాదివాద్యధ్వనులతోఁ గూడియుండునట్లిదియుఱుములు మొదలగువానిధ్వనులతోఁ గూడియున్నది. ఇట్లు మహారాజలక్షణంబు

లతో వర్షఋతువు వచ్చినది. ఈ ఋతువున జలాపూర్ణంబులగు మేఘంబుల యొక్కయు అట్టి మేఘములపై వ్యాపించుచుండు మెఱుపులయొక్కయు ఇంద్ర ధనుస్సులయొక్కయు కాంతు లుత్కటములై మనోహరముగ నలరారు చుండును. గ్రీష్మమున ఘర్మసంతప్తములై యుండు మేదినీ యీఋతువున వర్ష జలంబులచేఁ జల్లఁబడుటచేతను మనోహరకాంతియంతమగు ప్రకృతి కనుల యెదుట నలరారుచుండుటచేతను కాముకుల కుత్సాహముఁ గలుగఁజేయునది. కావున వారి కీఋతువు మిగుల నిష్టము నొడగూర్చును.

శ్లో. నితాన్తనీలోత్పలపత్రకాంతిభిః
క్వచిత్ప్రభిన్నాంజనరాశిసన్నిభైః,
క్వచిత్సగర్భప్రమదాస్తనప్రభైః
సమాచితం వ్యోమ ఘనైస్సమంతతః. 2

టీ. క్వచిత్ = ఒకస్థలమున, నితాంత...కాంతిభిః-నితాన్త = మిగుల, నీల = నల్లనైన, ఉత్పల = కలువలయొక్క, పత్ర=రేకులయొక్క, కాంతిభిః= కాంతివంటి కాంతికలిగినవియును, క్వచిత్ = ఒకస్థలమున, ప్రభిన్న...సన్నిభైః- ప్రభిన్న = బాగుగనూరఁబడిన, అంజన = కాటుకయొక్క రాశి.. ప్రోగుతో, సన్నిభైః=సమములైనవియును, క్వచిత్=ఒకస్థలమున, సగర్భ...ప్రభైః-సగర్భ= గర్భముతోఁగూడిన, ప్రమదా=స్త్రీలయొక్క, స్తన=స్తనములయొక్క, ప్రభైః= కాంతివంటి కాంతికలిగినవియునగు ఘనైః= మేఘములచే, వ్యోమ = ఆకాశము, సమంతతః = అంతటను, సమాచితం = బాగుగఁజుట్టఁబడినది.

తా. ఆకాశము నంతయు నావరించుకొనియుండు మేఘములు కొన్ని స్థలములందు తెలు పెంతమాత్రమును కలియక మిగుల నల్లనై యుండు కలువ రేకులవలె నీలమగు కాంతి కలిగినవిగ నున్నవి. మఱికొన్ని స్థలములయందు మిగుల స్నిగ్ధముగ నుండు బాగుగ నూరఁబడిన కాటుక యంతయుం ప్రోగుగఁ జేర్చి యుంచినట్లు నల్లగ నున్నవి. ఇంకను గొన్నిస్థలములయందు పసిమితోఁ గూడిన నలుపుకాంతికలిగి గర్భిణి యగునువిదకుచంబులకాంతిని బోలినకాంతి కలవిగ

నున్నవి. ఇట్లు నానావిధములగు కాంతులచే నొప్పారుచుండు మేఘములు ఆకాశమందంతట నలమికొనియుండ చూడ మనోహరమై యొప్పారుచున్నది.

శ్లో. తృషాకులైశ్చాతకపక్షిణాం కులైః
ప్రయాచితాస్తోయభరావలంబినః,
ప్రయాన్తి మన్దం బహుధారవర్షిణో
వలాహకాః శ్రోత్రమనోహరస్వనాః. 3

టీ. తృషాకులైః-తృషా = దప్పిచే, ఆకులైః=వ్యాకులములైన, చాతకపక్షిణాం=చాతకపక్షులయొక్క, కులైః=సమూహములచేత, ప్రయాచితాః=ప్రార్థింపఁబడినవై, తోయ...లంబినః-తోయ=జలముయొక్క, భర = బరువుచే, అవలంబినః = వ్రేలుచుండునవియు, బహు...వర్షిణః-బహు = అనేకములగు, ధార = ధారలుకలుగునట్లు, వర్షిణః = వర్షించునవియు, శ్రోత్ర..స్వనాః - శ్రోత్ర=చెవులకు, మనోహర=ఇంపగు, స్వనాః=ధ్వనులుకలిగినవియునగు, వలాహకాః = మేఘములు, మన్దం = మెల్లగ, ప్రయాన్తి = పోవుచున్నవి.

తా. వర్షఋతువు గడచిపోయినపిమ్మట తిరిగి యిప్పటివఱకును జలపానము చేయని వగుట మిగుల దప్పిఁగొని యుండుచాతకంబులు గుంపులు గుంపులై తమ్మనుసరించి జలము నర్థింపుచుండ జలము నిండియుండుట నాభారంబున వ్రేలుచు ధారాపాతము కలుగునట్లధికముగ వర్షింపుచు ఉరుములచే మనోహరముగ ధ్వనింపుచు మేఘములు మెల్లగ నటునిటు సంచరించుచున్నవి.

శ్లో. వలాహకాశ్చాశనిశబ్దమర్దలాః
సురేన్ద్రచాపం దధత స్తటిద్గుణమ్,
సుతీక్ష్ణధారాపతనోగ్రసాయకై
స్తుదన్తి చేతః ప్రసభం ప్రవాసినామ్. 4

టీ. అశని...మర్దలాః-అశని = పిడుగులయొక్క, శబ్ద=ధ్వనియను, మర్దలాః=మద్దెలలుకలిగినదియు, తటిద్గుణం-తటిల్ =మెఱుపులనియెడు, గుణం=నారి

కలిగిన, సురేన్ద్రచాపం = ఇంద్రధనుస్సును, దధతః = ధరించుచుండునవియుం (నగు), వలాహకాః= మేఘములు, సుతీక్ష్ణ...సాయకైః-సుతీక్ష్ణ=మిగులవాఁడి యగు, ధారా=జలధారలయొక్క, పతన = విడుచుటయనియెడు, ఉగ్ర=తీక్ష్ణములగు, సాయకైః=బాణములచే, ప్రవాసినాం = విదేశములయందుండువారియొక్క, చేతః = మనసును, ప్రసభం = బలాత్కారముగ, తుదన్తి=బాధించుచున్నవి.

తా. ఈ ఋతువున మేఘములు చల్లని జలధారలను తీక్ష్ణము లగు ములుకులవలె విడుచుచు. కాయాకార్యాంబులపై తమ ప్రియురాండ్రను విడిచి దూరదేశంబుల కరిగి యుండువారల నెంతయు పీడించుచున్నవి. గ్రీష్మమునకి యీ ఋతువురాగనే మేఘము చల్లనిజలధారల వర్షింపుచుండ తాపమారి యుత్సాహము పెరిగి వర్షకాలము విరహిజనులకు దుస్సహ మగుటచే ప్రవాసములనుండువారు ప్రియావియోగజమగుపీడ ననుభవించుచున్నారు. మఱియుం మేఘము లుఱుములఁబఱపుచు పిడుగులవిడుచుచు ధ్వనించుచుండ విరహులఁ బీడింప నేతెంచుచు మర్దలాదిరణవాద్యంబులఁ జేయుచుండు నట్లున్నవి. మెఱుపులును ఇంద్రధనుస్సును నలరారుచుండ జలధారల విడుచుచు సంచరించు మేఘములు విరహిజనులను బాధించుటకై నారిసవరించి యుండుధనుస్సును గైకొని ములుకులఁబఱపుచు నేతెంచున ట్లగపడుచున్నవి.

శ్లో. ప్రభిన్నవైడూర్యనిభై స్తృణాంకురైః
సమాచితా ప్రోత్థితకందలీదళైః,
విభాతి శుక్లేతరరత్నభూషితా
వరాంగనేవ క్షితిరిన్ద్రగోపకైః. 5

టీ. క్షితిః=భూమి, ప్రభిన్న—నిభైః-ప్రభిన్న = నలియఁగొట్టఁబడిన, వైడూర్య=వైడూర్యమణులతో, నిభైః=సమములైన, తృణాంకురైః-తృణ=గడ్డియొక్క, అంకురైః= మొలకలచేతను, ప్రోత్థిత...దళైః-ప్రోత్థిత = అధికముగ బయలు వెడలిన, కందలీ=నేలతాళ్లయొక్క, దళైః = పత్రములచేతను, ఇంద్రగోపకైః=ఆరుద్రపురుగులచేతను, సమాచితా=ఆవరింపఁబడినదై, శుక్లే...భూ

షితా-శుక్లేతర=తెల్లవికాని, రత్న=మణులచే, భూషితా = అలంకరింపఁబడిన, వరాంగనేవ = ఉత్తమస్త్రీవలె, విభాతి = ప్రకాశించుచున్నది.

తా. వర్షము లారంభమైనవెంటనే గడ్డిమొలకలన్నియు గారవర్ణములై వ్యాపించి వైడూర్యపురవ్వలవలె నలరారుచుండ, నేలతాడియాకు లంతటను బయలువెడలి నీలమణులం బోలి యుండ, ఆరుద్రపురుగులంతటఁ బరవి పద్మరాగాదులవలె నొప్పుచుండ, భూమి వజ్రములు మొదలగు తెల్లనిమణులు గాక నితరవర్ణంబులుగలమణులచే నొప్పునాభరణంబుల ధరియించి యుండు నుత్తమసుందరివలె నొప్పుచున్నది.

శ్లో. సదా మనోజ్ఞం స్వనదుత్సవోత్సుకమ్
వికీర్ణవిస్తీర్ణకలాపశోభితమ్,
ససంభ్రమాలింగనచుంబనాకులం
ప్రవృత్తనృత్యం కులమద్య బర్హిణామ్. 6

టీ. సదా=ఎల్లప్పుడును, మనోజ్ఞం = మనోహరమైనదియు, స్వనత్ = ధ్వనించుచుండునదియు, ఉత్సవోత్సుకం-ఉత్సవ=హర్షముచేత, ఉత్సుక=వేడుక కలిగినదియు, వికీర్ణ...శోభితం వికీర్ణ = ప్రసరింపఁజేయఁబడినదియు, విస్తీర్ణ = వ్రేలుచుండునదియు (నగు), కలాప = పురిచే, శోభితం=ప్రకాశించునదియు, ససంభ్రమ...ఆకులం-ససంభ్రమ=త్వరతోఁగూడినట్లుగ, ఆలింగన=కౌగలించుట యందును, చుంబన=ముద్దుగొనుటయందును, ఆకులం=వ్యాకులమైనదియు(నగు), బర్హిణాం = నెమిళ్లయొక్క, కులం = సమూహము, అద్య=ఇప్పుడు, ప్రవృత్తనృత్యం ప్రవృత్త = ఆరంభింపఁబడిన, నృత్యం = ఆటకలిగినదై యున్నది.

తా. మేఘము లన్నియు వ్యాపించి యురుములతోడను మెఱుపులతోడను వర్షించుచుండ నెమిళ్లన్నియు మనోహరములగు రావములతో సుందరముగఁ గూయుచు సంతసము పెంపొంది వాన నుత్కంఠ గదుర పింఛంబుల నూడ్చి యవి వ్రేలుచుండ నెంతయు నొప్పును జంట లొండొంటిని చుట్టి వచ్చుచు నొరసికొనుచు నాలింగనముఁ జేసికొనుటయందును ముక్కులతో

నొండొంటి చెక్కిళులయందును శిఖాభాగములయందును స్పృశింపుచు ముద్దులఁ గొనుటయందును త్వరను ఆకులమును పొందుచు నాడుట కుపక్రమించినవి.

శ్లో. నిపాతయన్త్యః పరితస్తటద్రుమాన్
ప్రవృద్ధవేగైస్సలిలైరనిర్మలైః,
స్త్రియః సుదుష్టా ఇవ జాతవిభ్రమాః
ప్రయాన్తి నద్యస్త్వరితం పయోనిధిమ్. 7

టీ. ప్రవృద్ధవేగైః-ప్రవృద్ధ=అధికమైన, వేగైః = ప్రవాహముకలిగి, అనిర్మలైః=కలుషములైయుండు, సలిలైః=జలములచే, పరితః = అంతటను, తటద్రుమాన్=దరులయందలిచెట్లను, నిపాతయన్త్యః = పడగొట్టుచుండునవియు, జాతవిభ్రమాః-జాత = కలిగిన విభ్రమాః = సుళ్లుఁగలిగినవియు (నగు), నద్యః= నదులు, సుదుష్టాః=చెడిన, స్త్రియఇవ=స్త్రీలవలె, పయోనిధిం = సముద్రమును గూర్చి, త్వరితం = శీఘ్రముగ, ప్రయాన్తి = పోవుచున్నవి.

తా. వర్షములచే కలుషజలప్రవాహ మధికమై తద్వేగముచే నన్నివైపులనుండియు దరులయందలిచెట్లను పడగొట్టుచు రయాధిక్యముచే సుళ్ళు నేర్పఱచుచు నదులన్నియు సముద్రమునకు పరువులెత్తుచున్నవి. ఇప్పు డీనదులుత్సాహ మగ్గలమై దుర్వ్యాపారంబులచే మలినమై యుండులావణ్యసౌందర్యాదులచే మాతాపితృకులంబులయందలి జనులకు తలవంపులఁ గలిగించి వారిని గౌరవమునుండిపడఁగొట్టుచు కాముకాదిసందర్శనముచే శృంగారాదిచేష్టలు గలుగుచుండ రయంబున నడచుచుఁ బోవుచుండు దుష్టాంగనలవలె నున్నవి.

శ్లో. తృణోత్కరైరుద్గతకోమలాంకురై
ర్విచిత్రనీలైర్హరిణీముఖక్షతైః,
వనాని వైంధ్యాని హరన్తి మానసం
విభూషితాన్యుద్గతపల్లవైర్ద్రుమైః. 8

టీ. ఉద్గత...అంకురైః - ఉద్గత = బయలువెడలిన, కోమల = మృదువైన, అంకురైః=మొలకలుకలిగినదియు, విచిత్రనీలైః-విచిత్ర = నానావర్ణము

లైనవియు, నీలైః = నల్లనైనవియు, హారిణీ...క్షతైః-హారిణీ = లేళ్ళయొక్క, ముఖ = ముఖములచే, క్షతైః = నఱుకఁబడినవియు (నగు), తృణోత్కరైః - తృణ=గడ్డియొక్క, ఉత్కరైః = సమూహములచేతను, ఉద్గతపల్లవైః-ఉద్గత= బయలువెడలిన, పల్లవైః = చిగుళ్ళుకలిగిన, ద్రుమైః = చెట్లచేతను, విభూషితాని=అలంకరింపఁబడిన, వైంధ్యాని = వింధ్యపర్వతసమీపములగు, వనాని=అడవులు, మానసం = మనస్సును, హరన్తి = హరించుచున్నవి.

తా. వర్షము లారంభము లైనంతనే కోమలము లగుమొలకల నెత్తి లేళ్ళచేఁ గొఱుకఁబడి కొన్నిచోటుల నానావర్ణంబులయ్యుఁ గొన్నిచోటుల నల్లనివయ్యు నొప్పుచుండు నానావిధములగు గడ్డిజాతులును చిగుళ్ళు బయలు వెడలి మనోహరములుగ నుండువృక్షములును నొక క్రొత్తయలంకారము నొడగూర్చుచుండ వింధ్యపర్వత ప్రాంతంబుల నుండునరణ్యభూము లెంతయు హృద్యముగ నగుపడుచున్నవి.

శ్లో. విలోలనేత్రోత్పలశోభితాననై
ర్మృగైః సమంతాదుపజాతసాధ్వసైః,
సమాచితా సైకతినీ వనస్థలీ
సముత్సుకత్వం ప్రకరోతి చేతసః. 9

టీ. విలోల...ఆననైః-విలోల = చంచలములైన, నేత్రోత్పల=కలువలవంటి నేత్రములచే, శోభిత = ప్రకాశించు, ఆననైః=ముఖమునుకలిగినవియుం, ఉపజాతసాధ్వసైః - ఉపజాత = పుట్టిన, సాధ్వసైః = భయముకలిగినవియుం (నగు), మృగైః=లేళ్ళచే, సమంతాత్ =అంతటను, సమాచితా = వ్యాపించఁబడినదియుం, సైకతినీ=ఇసుకకలిగియుండు, వనస్థలీ=వనప్రదేశము చేతసః=మనస్సునకు, సముత్సుకత్వం = వేడుకకలుగునదగుటను, ప్రకరోతి=చేయుచున్నది.

తా. ఈ ఋతువున నుఱుములను మెఱుములను ఎల్లెడల సందడిఁ జేయుచుండ లేళ్ళు భయముచే చంచలములై నల్లనై పెద్దకనులు కలిగియుండుముఖం

ఋలతో నొప్పుచు అడవియందలి యిసుకనేలయం దంతటను వ్యాపించి యున్నవి, అట్టినేలలఁ జూచుటకు మనసున నెంతయుం వేడుక కలుగుచున్నది.

శ్లో. అభీక్ష్ణముచ్చైర్ధ్వనతా పయోముచా
ఘనాంధకారీకృతశర్వరీష్వపి,
తటిత్ప్రభాదర్శితమార్గభూమయః
ప్రయాన్తి రాగాదభిసారికాః స్త్రియః. 10

టీ. అభిసారికాః = అభిసారికలగు, స్త్రియః = అంగనలు, అభీక్ష్ణం = మాటిమాటికి, ఉచ్చైః = బిగ్గరగ, ధ్వనతా = ఉఱుముచుండెడు, పయోముచా = మేఘముచేత ఘన...శర్వరీష్వపి-ఘన = దట్టములగు, అంధకారీకృత = అంధకారముకలదిగఁ జేయంబడిన, శర్వరీష్వపి = రాత్రులయందును, తడిత్... భూమయః-తడిత్ = మెఱుపులయొక్క, ప్రభా = కాంతిచే, దర్శిత = చూపఁబడిన, మార్గ = మార్గమునందలి, భూమయః = ప్రదేశములుకలవరలై, రాగాత్ = అనురాగమువలన, ప్రయాంతి = వెళ్లుచున్నారు.

తా. "కాంతార్థినీ తు యా యాతి సంకేతం సాఽభిసారికా" మనోహరసమాగమమును కోరి సంకేతస్థలమున కరుగుకామిని "అభిసారిక" యనంబడును:—అనులక్షణముచే చెప్పఁబడునభిసారికాంగనలు ఋతుధర్మంబుచే నుత్సాహము రేగి కామమగ్నలమై ప్రియులయందలి యనురాగము గాఢముగ మనసునఁ దోఁచి ప్రియసమాగమకాంక్ష దృఢమై ప్రేరేపింప మాటిమాటికిని మేఘములు భయంకరముగ నుఱుముచున్నను మేఘవ్యాప్తిచే నంధకారము దట్టముగ నలముకొనియున్నను రాత్రులయం దప్పుడప్పుడు కలుగుచుండు మెఱుపులయొక్క కాంతిచే గుఱుతులు మొదలగువానినిఁ దెలుపుమార్గమునందలి ప్రదేశంబుల నెఱుంగుచు సంకేతప్రదేశంబుల కరుగుచున్నారు.

శ్లో. పయోధరైర్భీమగభీరనిస్వనై
స్తటిద్భిరుద్వేజితచేతసో భృశమ్,

కృతాపరాధానపి యోషితః ప్రియాన్
పరిష్వజంతే శయనే నిరంతరమ్. 11

టీ. భీమ...నిస్వనైః-భీమ = భయంకరమైనట్టియు, గభీర = గంభీరమైనట్టియు, నిస్వనైః=ధ్వనులుకలిగిన, పయోధరైః=మేఘములచేతను, తడిద్భిః= మెఱుపులచేతను, భృశం = మిక్కిలి, ఉద్వేజితచేతసః-ఉద్వేజిత = ఉత్కంఠ కలిగిన, చేతసః = మనసుకలిగిన, యోషితః=అంగనలు, కృతాపరాధానపి—కృత = చేయబడిన, అపరాధానపి = అపరాధముకలవారైనను ప్రియాన్= ప్రియులను, శయనే = శయ్యయందు, నిరంతరం = బిగువుగ, పరిష్వజంతే = కౌఁగలించుచున్నారు.

తా. "గాఢవిప్రియకృచ్ఛఠః" అంగనావలోకనాదిగాఢాపరాధం బులఁ జేయువాఁడు శఠుండు అనులక్షణముచొప్పున శఠనాయకులు కృతాప రాధులై యుండ తదవజ్ఞానముచే కుపితలైనఖండితనాయికలు రోషంబున నాలింగనాదుల మాని శయ్యపై దూరంబున శయనింపుచుండి కొంతసేపటి కాకాశంబున మేఘంబులు వ్యాపించి భయంకరముగ నుఱుముచు మనోహరం బుగ మెఱయుచు వర్షించుచుండ మనంబున భయంబును నుత్సాహంబును పెరిగి యుత్కంఠ యతిశయింప ప్రియుల యపరాధంబుల మఱచి కోపంబుల విడిచి సమీపించి గాఢముగ నాలింగనములఁ జేసికొనుచున్నారు.

శ్లో విలోచనేందీవరవారిబిందుభిః
నిషిక్తబింబాధరచారుపల్లవాః,
నిరస్తమాల్యాభరణానులేపనాః
స్థితా నిరాశాః ప్రమదాః ప్రవాసినామ్. 12

టీ. విలోచన...బిందుభిః—విలోచనేందీవర = పద్మములవంటి నేత్ర ములయందలి, వారి = కన్నీళ్లయొక్క, బిందుభిః = చుక్కలచేత, నిషిక్త... పల్లవాః-నిషిక్త = తడుపఁబడిన, బింబాధరచారుపల్లవాః = మనోహరములగు చిగుళ్ళవంటి బింబాధరములు కలిగినట్టియు, నిరస్త...లేపనాః - నిరస్త=విడువఁ

బడిన, మాల్య = పుష్పాదిమాలికలును, ఆభరణ = ఆభరణములును, అనులేప నాః = పూఁతలును కలిగినట్టివిగాని, ప్రవాసినాం = ప్రోషితులగువారియొక్క, ప్రమదాః=స్త్రీలు, నిరాశాః=అపేక్షలుడిగినవారలై, స్థితాః = ఉందురు.

తా. ప్రియులు కార్యాంతరంబుల నిర్వర్తించుటకై దేశాంతరంబుల కరుగుటయుం నంతట వర్షఋతువు సమాగతంబగుటయుం కామము చే ప్రియ వియోగంబును భరియింపఁ జాలక విచారముచే కనుదామరలనుండి జలబిందువులు ప్రవహించి చిగుళ్ళవలె మృదువుగను దొండపండువలె నెఱ్ఱనయ్యు నుండు నధరోష్ఠము తడియుండ నిట్టూర్చుచు "ప్రోషితే మలినా కృశా" యనున ట్లిప్పుడు వాని ప్రయోజనము లేకుండుటచే కేశపాశంబులయందు పుష్పాదుల మాలికలముడుచుకొనక రత్నాద్యాభరణంబుల ధరింపక పునుగు మొదలగుసుగంధ ద్రవ్యంబులఁ బూసికొనక విచారంబున మలినలై ప్రియుఁడు వచ్చు ననెడి యాశను వీడి ప్రోషితాంగనలు దుఃఖనిమగ్నలై యున్నారు.

శ్లో. విపాండురం కీటరజస్తృణాన్వితం
　భుజంగవద్వక్రగతిప్రసర్పితమ్,
　ససాధ్వసైర్భేకకులైర్నిరీక్షితం
　ప్రయాతి నిమ్నాభిముఖం నవోదకమ్.　　13

టీ. విపాండురం = పాండురవర్ణము (ఎక్కువ తెలుపుతోఁగల పసుపు రంగు) కలిగినదియు, కీట...అన్వితం - కీట = పురుగులతోడను, రజః = ధూళితోడను, తృణ = గడ్డితోడను, అన్వితం = కూడినదియుం, భుజంగవత్ = పామువలె, వక్ర..ప్రసర్పితం-వక్ర=వంకరయగు, గతి = గమనముయొక్క ప్రసర్పితం = ప్రసారముకలిగినదియు, ససాధ్వసైః = భయముతోఁగూడిన, భేకకులైః-భేక = కప్పలయొక్క కులైః = సమూహములచే, నిరీక్షితం = చూడఁబడినదియు (నగు), నవోదకం = నూతనజలము, నిమ్నాభిముఖం - నిమ్న = పల్లమునకు, అభిముఖం=అభిముఖమై, ప్రయాతి = పోవుచున్నది.

తా. మేఘములు చేరి క్రొత్తగ వర్షించినంతనే ధూళితోడం గూడి పాండురవర్ణమై యచ్చటచ్చట నుండుపురుగులు గడ్డి మొదలగునవియుం బ్రవాహమునం బడి కొట్టుకొని వచ్చుచుండ పామునడకవలె వంకరగ జరిగి పోవుచు వర్షపాతము నభిలషించి పైకి వెడలి వచ్చియుండు కప్పలు వానిం జూచి భయమునందుచుండ మెరకచోటులఁబడినజలంబులు పల్లపునేలలవైపునకు ప్రవహించి పోవుచున్నవి.

విపత్రపుష్పాం నళినీం సముత్సుకా
విహాయ భృంగాః శ్రుతిహారినిస్వనాః,
పతంతి మూఢాః శిఖినాం ప్రనృత్యతాం
కలాపచక్రేషు నవోత్పలాశయా. 14

టీ. భృంగాః=తుమ్మెదలు,విపత్రపుష్పాం - విపత్ర=దళము లేని పుష్పాం=పూవులుగల, నళినీం=తామరను, విహాయ = విడిచి, సముత్సుకాః=ఉత్కంఠ కలవై, శ్రుతి...నిస్వనాః-శ్రుతిహారి = చెవులకింపగు, నిస్వనాః=ధ్వనులుకలవై, నవ...ఆశయా-నవ=నూతనమగు, ఉత్పల=కలువల నెడు, ఆశయా=అపేక్షచే, మూఢాః=మూఢములై, ప్రనృత్యతాం=ఆడుచుండెడు,శిఖినాం = నెమళ్ళయొక్క, కలాపచక్రేషు-కలాప = పింఛముయొక్క, చక్రేషు = మండలములయందు, పతంతి=పడుచున్నవి.

తా. వర్షము లారంభమైనంతనే కమలములదళములు రాలిపోవుటచే అందు మకరందాపేక్షలేమిం జేసి తుమ్మెదలు తామరను విడిచి వర్షర్తువున నవోదయ మందియుండుకలువపూవులపై కరుగఁదలఁచి మేఘావలోకనమునఁగలిగిన సంతసముచే పింఛము లార్చి యాడుచుండు నెమళ్ళం గని వస్తువిభాగజ్ఞానము లేక యాపింఛములే కలువపూవులని భ్రమసి యుత్కంఠతో ఝుంకారములఁజేయుచు పింఛములపై వ్రాలుచున్నవి.

వనద్విపానాం నవవారిదస్వనైః
మదాన్వితానాం ధ్వనతాం ముహుర్ముహుః,

కపోలదేశా విమలోత్పలప్రభాః
సభృంగయూథైర్మదవారిభిశ్చితాః.

టీ. నవ...స్వనైః - నవ=నూతనమగు, వారిద = మేఘములయొక్క, స్వనైః=ధ్వనులచేత, మదాన్వితానాం-మద=మదముతో, అన్వితానాం=కూడినవియగు,ముహుర్ముహుః=మాటిమాటికిని, ధ్వనతాం-అఱచుచుండెడి, వనద్విపానాం=అడవియేనుఁగులయొక్క, విమల...ప్రభాః-విమల=స్వచ్ఛమగు, ఉత్పల=కలువయొక్క, ప్రభాః=కాంతివంటి కాంతికలిగియుండు, కపోలదేశాః=గండస్థలములు, సభృంగయూథైః=తుమ్మెదపిండులతోఁ గూడిన, మదవారిభిః=మదజలములచే, చితాః=వ్యాప్తములై యున్నవి.

తా. జలములు నిండియుండు క్రొత్త కారుమేఘంబులు గంభీరముగ గర్జింపుచుండ మఱియొకమదగజ మఱచుచున్న దనుతలంపు గలిగి మదము చే విడువక ఘీంకారధ్వనులం జేయుచు అడవియేనుఁగులు మదజలముయొక్క వాసనకై తుమ్మెదలు మూఁగుచుండఁ గలువకాంతి గలిగి యలరారుచుండ గండభాగంబులతో నెంతయు నొప్పుచున్నవి.

సితోత్పలాభాంబుదచుంబితోపలాః
సమాచితాః ప్రస్రవణైః సమంతతః
ప్రవృత్తనృత్తైః శిఖిభిః సమాకులాః
సముత్సుకత్వం జనయన్తి భూధరాః.　　1

టీ. సిత...ఉపలాః-సితోత్పల=తెల్లగలువలయొక్క, ఆభ = కాంతివంటి కాంతికలిగిన, అంబుద=మేఘములచే, చుంబిత=అంటి పట్టుకొనఁబడి ఉపలాః=ఱాళ్లు కలిగినవియు, సమంతతః=అంతటను, ప్రస్రవణైః = ఊటనీ ప్రవాహములతో, సమాచితాః=వ్యాప్తములైనవియు, ప్రవృత్తనృత్తైః-ప్రవృత్త=ఆరంభింపఁబడిన, నృత్తైః=ఆటలుగల, శిఖిభిః=నెమళ్లచే, సమాకులాః వ్యాపించఁబడినవియు (నగు), భూధరాః=కొండలు, సముత్సుకత్వం = వేడ తోఁగూడియుండుటను, జనయంతి=పుట్టించుచున్నవి.

తా. ఈఋతువున కొండలన్నియుం జలములఁగార్చుచు తెలిగలువలవలె నుండు మేఘములు పైభాగములయందలి ఱాళ్లనంటి పట్టుకొనియుండ నెంతయు నొప్పుచున్నవి. వాని యన్నిభాగములయందును వర్షజలములచేతను ఊటకాలువలచేతను నేర్పడినప్రవాహములు గలిగి యున్నవి. అంతటను అకులంబుగ నాడుచు నెమళ్లు వ్యాపించియున్నవి. ఇట్టివి చూచుట కెంతయుం గోరికను పుట్టించుచున్నవి.

కదంబసర్జార్జున కేతకీవనం
వికంపయం స్తత్కుసుమాధివాసితః,
సశీకరాంభోధరసంగశీతలః
సమీరణః కిం న కరోతి సోత్సుకమ్. 17

టీ. కదంబ...వనం-కదంబ = కడిమచెట్లయొక్కయుం, సర్జ = ఏపెచెట్ల యొక్కయుం, అర్జున=మద్దిచెట్ల యొక్కయుం, కేతకీ=మొగలిచెట్లయొక్కయుం, వనం=అడవిని, వికంపయన్=కదల్చుచున్నదై, తత్...వాసితః-తత్=ఆయా చెట్లసంబంధమగు, కుసుమ=పూవులచే, అధివాసితః=సువాసనకలిగినదియుం, సశీకర...శీతలః - సశీకర=నీటితుంపరలతోఁ గూడియుండు, అంభోధర = మేఘములయొక్క, సంగ=సంబంధముచే, శీతలః = చల్లనైనదియుం (నగు), సమీరణః=వాయువు, కం=ఎవనిని, సోత్సుకం=ప్రియప్రాప్తియందు తొందరతోఁ గూడినవానినిగ, న కరోతి=చేయదు?

తా. వర్షర్తువునఁ బుష్పించుకడిమచెట్లును ఏపెచెట్లును మద్దిచెట్లును మొగలిచెట్లును విస్తారముగ నుండునడవులమీఁదుగఁ బఱచుగాలి యాచెట్లం గదల్చుచు నాపూవులసంబంధముచే సువాసన కలిగినదై నీటిమేఘములపై నుండి వచ్చుచుండుటచే మిగులఁజల్లనై వీచుచు ఎవ్వరిమనస్సులయందు ప్రియాసమావేశము మొదలగునిష్టములయం దుత్సాహము కలుగఁజేయదు? అందఱకు నుత్సాహమును గలుగఁజేయును.

శిరోరుహైః శ్రోణితటావలంబిభిః
కృతావతంసైః కుసుమైః సుగంధిభిః
స్తనైస్సహారైర్వదనైస్ససీధుభిః
స్త్రియో రతిం సంజనయన్తి కామినామ్. (18)

టీ. శ్రోణి...లంబిభిః - శ్రోణితట = పిఱుఁదులదరిని, అవలంబిభిః = వ్రేలుచుండెడి, శిరోరుహైః=కురుల చేతను, కృతావతంసైః=చేయఁబడిన శిరోభూషణములైనట్టియు, సుగంధిభిః = సువాసనకలిగినట్టియు, కుసుమైః=పూవుల చేతను, సహారైః=మాలికలతోఁగూడిన, స్తనైః=కుచముల చేతను, ససీధుభిః = మద్యముతోఁగూడిన, వదనైః = ముఖముల చేతను, స్త్రియః = స్త్రీలు, కామినాం=కాముకులకు, రతిం= రాగమును, సంజనయంతి=పుట్టించుచున్నారు.

తా. సుందరురాండ్రగు కామినులుదీర్ఘములగుకురులుపిఱుఁదులపైఁబడి వ్రేలాడుచుండ మంచిపరిమళములు గలయుత్తమకుసుమంబులను శిరోభూషణంబులుగ తలలయందు ముడిచికొని స్తనశిరస్సులనుండి వ్రేలునట్లు కంఠంబున ముక్తాదులహారముల ధరించి తా మానినయుండు మద్యామోదము నోటినుండి వెలిఁబెంచి వ్యాపించుచుండ నెంతయు నొప్పుచుఁ గాముకులకు శృంగారభావంబుల నుద్రేకింపఁ జేయుచున్నారు.

తటిల్లతా శక్రధనుర్విభూషితాః
పయోధరాస్తోయభరావలంబినః,
స్త్రియశ్చ కాంచీమణికుండలోజ్జ్వలా
హరంతి చేతో యుగపత్ప్రవాసినామ్. 19

టీ. తటిత్...విభూషితాః-తటిల్లతా = తీఁగలవంటి మెఱపుల చేతను, శక్రధనుః = ఇంద్రధనుస్సు చేతను, విభూషితాః = అలంకరింపఁబడిన, తోయభరావలంబినః-తోయ = జలముయొక్క, భర-బరువు చేత, అవలంబినః=వ్రేలుచుండు, పయోధరాః= మేఘములును, కాంచీ...ఉజ్జ్వలాః-కాంచీ= మొలనూ

ళ్ళచేతను, మణికుండల=రత్నపుఁ గమ్మలచేతను, ఉజ్జ్వలాః=ప్రకాశింపుచుండు స్త్రియశ్చ=స్త్రీలును, ప్రవాసినాం = బాటసారులయొక్క, మనాంసి=మనస్సులను, యుంగపత్=ఒక్కసారిగ, హరంతి=హరించుచున్నారు.

తా. తీఁగలవలె వ్యాపించుచు మెఱయుచుండు మెఱపులును నానావర్ణంబులచే శోభిల్లునింద్రధనుస్సులును గలిగి నీరు నిండియుండుటచే నల్లనై భూమికి సమీపములై వ్రేలుచుండెడు మేఘములును మణిఖచితములగుకమ్మలను బంగరుతీఁగల మొలనూళ్ళను ధరించి యొప్పుచుండు సుందరీమణులనుఁ గనినంతనే తమకామినులు స్మృతిపథమునంద నెంతయుఁ నుత్కంఠ రేఁగి బాటసారులు దాని నెంతయు తమకముతోఁ గనుచున్నారు. అని వారిమనంబుల నెంతయుఁ నింపుఁ బుట్టించుచున్నవి.

మాలాః కదమ్బనవకేసరకేతకీభి
రాయోజితాశ్శిరసి బిభ్రతి యోషితోఽద్య,
కర్ణాన్తరేషు కకుభద్రుమమఞ్జరీభి
రిచ్ఛానుకూలరచితా నవతంసకాంశ్చ. 20

టీ. అద్య=ఇప్పుడు, యోషితః=స్త్రీలు, శిరసి=తలలయందు, కదంబ... కేతకీభిః-కదంబ=కడిమ పూవులతోడను, నవ = క్రొత్త, కేసర=పొగడపూవులతోడను, కేతకీభిః = మొగలిపూవుల తోడను, ఆయోజితాః = కూర్పఁబడిన, మాలాః = సరములను, కర్ణాన్తరేషు = చెవిసందులయందు, కకుభ...మంజరీభిః-కకుభద్రుమ=మద్దిచెట్లయొక్క, మంజరీభిః = చిగురుగుత్తులతో, ఇచ్ఛా...రచితాన్-ఇచ్ఛా=కోరికకు. అనుకూల = తగునట్లు, రచితాన్=కూర్పఁబడిన, అవతంసకాంశ్చ=కర్ణాలంకరణములను, బిభ్రతి=ధరింపుచున్నారు.

తా. ఈఋతువున కడిమలును పొగడలును మొగల్లును మద్దులును ఈమొదలగువృక్షజాతు లన్నియుఁ నెక్కువగ పుష్పించుచుండును గావున సుందరీమణులు కడిమపూవులను పచ్చిపొగడపూవులను మొగలిపూవులను జేర్చి సరులుగఁ గూర్చి వానిని తమతలలయందు ముడిచి యలంకరించుకొనుచున్నారు.

మద్దిచిగుళ్లను పూవులను తమతమ కింపగురీతిని గుత్తులు మొదలగునవిగఁ గట్టుకొని చెవికొనలయం దలంకరించుకొనుచున్నారు.

కాలాగురుప్రచురచన్దనచర్చితాఙ్గ్యః
పుష్పావతంససురభీకృతకేశపాశాః,
శ్రుత్వా ధ్వనిం జలముచాం త్వరితం ప్రదోషే
శయ్యాగృహం గురుగృహాత్ప్రవిశన్తి నార్యః. (21)

టీ. కాలాగురు...అంగ్యః-కాలాగురు=నల్ల అగురు, ప్రచుర = అధికముగనుండు, చందన=చందనముచేత, చర్చిత=పూయఁబడిన, అంగ్యః = అవయవములుంకలిగినట్టియు, పుష్ప... కేశపాశాః, పుష్ప=పూవులయొక్క, అవతంస=కర్ణాలంకారములచే, సురభీకృత = వాసనకలిగించఁబడిన, కేశపాశాః = తలముడికలిగిన, నార్యః=స్త్రీలు, ప్రదోషే = రాత్రిముఖమున, జలముచాం = మేఘములయొక్క, ధ్వనిం=ధ్వనిని, శ్రుత్వా=విని, గురుగృహాత్ =అత్తమామల గృహములనుండి, శయ్యాగృహం = పడకటింటిని, త్వరితం=శీఘ్రముగ, ప్రవిశంతి = ప్రవేశించుచున్నారు.

తా. కామిను లీఋతువున నెక్కువ చల్లదనమును గలిగించు పచ్చకర్పూరము మొదలగువానిని చందనమునఁ జేర్పక వేఁడిని గలిగించునల్లనియగురుచూర్ణమును సువాసనకై చందనమున నధికముగఁ గలిపి దానినొడలికిఁ బూసికొని చెవికొనల నలంకరించుకొనఁబడినపూలచేఁ దలకట్టంతయుఁ బరిమళించుచుండ రాత్రి మొదటియామమున అత్తమామలు మొదలగుపెద్దలకు సపర్యలఁ జేయుచుండి యాకాశంబున మేఘంబులు గర్జించుచు వ్యాపించుచుండ వాని ధ్వనిని విని గాఢోత్కంఠితలై సహింపంజాలక గురుజనములసపర్యల వేవేగ ముగించుకొని యచ్చటినుండి తమపడకటిండ్లకుఁ జేరుకొనుచున్నారు.

కువలయదళనీలై రున్నతైస్తోయనమ్రైః
మృదుపవనవిధూతైః మన్దమన్దం చలద్భిః

అపహృతమివ చేత స్తోయదై స్సేన్ద్రచాపైః
పథికజనవధూనాం తద్వియోగాకులానామ్. 22

టీ. కువలయదళనీలైః-కువలయదళ=నల్లగలువరేకులవలె, నీలైః = నీలవర్ణములైనవియు, ఉన్నతైః=ఎత్తైనవియు, తోయనమ్రైః-తోయ = జలముచే, నమ్రైః=వంగినవియు, మృదు...విధూతైః-మృదు = కొద్దిదగు, పవన = గాలిచే, విధూతైః=కదల్పఁబడినవియు, మందమందం=మెల్లమెల్లగా, చలద్భిః=కదలుచుండు, సేంద్రచాపైః=ఇంద్రధనుస్సుతోఁ గూడియుండు, తోయదైః=మేఘములచే, తత్...ఆకులానాం-తత్=వారియొక్క, వియోగ=వియోగముచే, ఆకులానాం=వ్యాకులురాండ్రగు, పథికజనవధూనాం పథికజన = బాటసారిజనుల, వధూనాం=స్త్రీలయొక్క, చేతః=మనస్సు అపహృతమివ = దొంగిలించుకొనిపోఁబడినదివలె నున్నది.

తా. కారుమబ్బులాకాశంబున నెత్తుగ నెల్లయెడల నలమికొని జలభారంబున వ్రేలుచు నల్లగలువరేకులవంటికాంతి యొప్పుచుండ మెల్లనిగాలికిఁ గొద్దికొద్దిగఁగదలుచు ఇంద్రధనుస్సుతోడం గూడియుండనద్దానిఁగని పథికాంగనలు ప్రియవియోగముచే గాఢముగ నుత్కంఠితలై కామభరంబును సహింపనోపక శూన్యహృదయలై పరితపించుచున్నారు. మేఘాగమనంబును పథికాంగనలయీస్థితియుఁ గనుఁగొన మేఘంబులు వీరిహృదయంబుల నపహరించికొనిపోయెనా యని తోఁచుచున్నది.

ముదిత ఇవ కదమ్బైర్జాతపుష్పైస్సమన్తాత్
పవనచలితశాఖైః శాఖిభిర్నృత్యతీవ,
హసితమివ విధత్తే సూచిభిః కేతకీనాం
నవసలిలనిషేకాచ్ఛాన్తతాపో వనాన్తః. 23

టీ. నవ...నిషేకాత్-నవ=నూతనమగు, సలిల=జలముయొక్క, నిషేకాత్=చల్లుటవలన, శాంతతాపః-శాంత=తగ్గిన, తాపః=తాపముకల, వనాంతః=వనప్రదేశము, జాతపుష్పైః-జాత = పుట్టిన, పుష్పైః = పుష్పములుఁగల,

కదంబైః=కడిమిచెట్లచే, ముదితఇవ=సంతసించినదివలెనున్నది, పవన...శాఖైః-పవన=గాలిచే, చలిత = కదల్పఁబడిన, శాఖైః=కొమ్మలుగల, శాఖిభిః=చెట్లచే, నృత్యంతీవ=ఆడుచున్నదివలెయున్నది, కేతకీనాం = మొగలిపూవుల, సూచిభిః=రేకులచే, హసితం=నవ్వును, విధత్తేఇవ=ధరించుచున్నట్లున్నది.

తా॥ ఈఋతువున వనభాగమునందు ఎచ్చటఁ జూచినను గడిమిచెట్లు పుష్పించియున్నవి. అద్దానినిఁ గనినచో నూతనమేఘములు బయలువెడలి చల్లని జలముల వర్షింపుచుండ దానిచే గ్రీష్మతాపమంతయుఁ శమించి వన ప్రదేశమంతయుఁ సంతసింపుచున్నదా యనునట్లు గనఁబడుచున్నది. సంతోషము కలవానికి వికాసము లక్షణముకదా! ఇట్లే గాలికిఁ జెట్లకొమ్మ లల్లాడు చుండ సంతసముచే వనమాడుచుండునట్లున్నది. తెల్లని మొగలిరేకులచే వనమంతయుఁ నవ్వునట్లగపడుచున్నది.

శిరసి వకుళమాలాం మాలతీభిస్సమేతాం
వికసితనవపుష్పైర్యూథికాకుట్మలైశ్చ
వికచనవకదమ్బైః కర్ణపూరం వధూనాం
రచయతి జలదౌఘః కాన్తవత్కాల ఏషః. 24

టీ. జలదౌఘః-జలద = మేఘములయొక్క, ఓఘః = సమూహముకల, ఏషః=ఈ,కాలః=కాలము, కాన్తవత్ = ప్రియుఁడువలె, వధూనాం=స్త్రీల యొక్క,శిరసి=శిరస్సునందుః మాలతీభిః=జాజిపూవులతో, సమేతాం=కూడిన, వకుళమాలాం=పొగడపూవులమాలికను, రచయతి=కూర్చుచున్నవి. వికసిత... పుష్పైః - వికసిత=వికసించిన, నవ=నూతనములగు, పుష్పైః = పూవులుగల, యూథికాకుట్మలైః=అడవిమొల్లమొగ్గలతోడను, వికచ...కదంబైః - వికచ= వికసించిన, నవ=క్రొత్త, కదంబైః = కడిమపూవులతోడను, కర్ణపూరం=కర్ణాలంకారమును, రచయతి=కూర్చుచున్నది.

తా. ఈవర్షకాలము మేఘముల నంతట వ్యాపింపఁజేసి బాగుగ వర్షించి ఏతద్ఋతుజన్యములగు నానాజాతుల పూవుల నెల్లయెడలసమృద్ధములగునట్లు

సమకూర్పుచుండ నంగనలు జాజిపూవులును పొగడపూవులును చేర్చి కూర్చిన సరములను దలలయం దలంకరించుకొనుచున్నారు. అడవిమొల్లమొగ్గలను గడిమి పూవులను జెవికొనల నలంకరించుకొనుచున్నారు. ఈవిధానము ప్రియుఁడు ప్రియురాండ్రకుఁ బుష్పాలంకారముల సమకూర్పుచందంబును దోపించు చున్నది.

దధతి వరకుచాగ్రైరున్నతైర్హారయష్టిం
ప్రతనుసితదుకూలాన్యాయతైః శ్రోణిబిమ్బైః,
నవజలకణసేకాదుద్గతాం రోమరాజిం
లలితవలివిభఙ్గైర్మధ్యదేశైశ్చ నార్యః. 25

టీ. నార్యః=స్త్రీలు, ఉన్నతైః = ఎత్తగు, వరకుచాగ్రైః-వర = ఉత్తము ములగు, కుచ=కుచములయొక్క, అగ్రైః=అగ్రభాగములచేత, హారయష్టిం = యష్టివంటిహారములను. ఆయతైః=విశాలములగు, శ్రోణిబింబైః=బింబములవంటి పిఱుఁదులచే, ప్రతను...దుకూలాని - ప్రతను=సన్నని, సిత = తెల్లని, దుకూ లాని -పట్టువలువలను, లలితవలివిభఙ్గైః - లలిత=మనోహారములగు, వలి=వళుల యొక్క, విభంగైః=విరుపులచే, నవ...సేకాత్ -నవ = నూతనమగు, జల=జల ముయొక్క, సేకాత్=చల్లుటవలన, ఉద్గతాం=పులకరించిన, రోమరాజిం = నూగారును, దధతి=ధరింపుచున్నారు.

తా. సుందరీమణులు ఎత్తై బలిసియుండుకుచములపై నుండి వ్రేలు నట్టి ముత్తియములు మొదలగువానిసరులను ధరించుచున్నారు. విశాలములగు పిఱుఁదుచక్కట్లపైఁ దెల్లని సన్నదువ్వలువల ధరించుచున్నారు. మనోహారము లగు వళులపై నుండి వ్యాపించి చల్లనివర్షజలము మేనుల సోకుటచే నిగిడిన నూగారులను ధరించుచున్నారు.

నవజలకణసంగాచ్ఛీతతా మాదధానః
కుసుమభరనతానాం లాసకః పాదపానామ్,
జనితరుచిరగన్ధః కేతకీనాం రజోభిః
పరిహరతి నభస్వాన్ ప్రోషితానాం మనాంసి. 26

టీ. నవ...సంగాత్=నవ=క్రొత్త, జల=జలముయొక్క, కణ = బిందువులయొక్క, సంగాత్=సంబంధమువలన, శీత తాం=చల్లదనమును, ఆదధానైః =స్వీకరించుచున్న, కుసుమ...నతానాం-కుసుమ = పూవులయొక్క, భర = బరువుచే, నతానాం=వంగియుండు, పాదపానాం=చెట్లను. లాసకైః = కదల్పుచుండు, కేతకీనాం=మొగలిపూవులయొక్క, రజోభిః = పరాగములచే, జనిత...గంధైః-జనిత=పుట్టిన, రుచిర=మనోహరమగు, గంధైః = పరిమళముకలిగిన, నభస్వాన్=వాయువు, ప్రోషితానాం=బాటసారుల, మనాంసి=మనస్సులను, పరిహరతి = తొలఁగించుచున్నాఁడు.

తా. క్రొత్తవర్ష జలబిందువులతోఁ గలియుటచేఁ జల్లనై పూవులబరువుచేవంగి కదలకయుండు చెట్లను కదల్చుచుండుట వానితాకుడువలన మందమై మొగలిపుప్పొడి నెగురఁగొట్టుకొని వచ్చుచుండుటచే సుగంధమై యలరారుచుండునీవర్ష కాలపువాయువులు బాటసారులకుద్రేకమును గలిగించి ప్రియావిరహముచే మనస్సులఁ జెదరఁ గొట్టుచున్నది.

జలధరవినతానామాశ్రయోఽస్మాకముచ్చై
రయ మితి జలసేకైస్తోయదాస్తోయనమ్రాః,
అతిశయపరుషాభిర్గ్రీష్మవహ్నేః శిఖాభిః
సముపజనితతాపం హ్లాదయ న్తీవ విన్ధ్యమ్. 27

టీ. తోయనమ్రాః-తోయ=జలముచే. నమ్రాః=వంగిన, తోయదాః= మేఘములు, అయం=ఈతఁడు, జల...వినతానాం-జల = జలముల, ధర = ధరించుటచే, వినతానాం=వంగిపోయిన, అస్మాకం=మనకు, ఉచ్చైః = ఉన్నతమగు, ఆశ్రయః=ఆధారమైనవాఁడు, ఇతి=అని, అతిశయపరుషాభిః = మిగుల కఠినములగు, గ్రీష్మవహ్నేః = దావానలముయొక్క, శిఖాభిః = జ్వాలలచే, సముపజనితతాపం-సముపజనిత=పుట్టిన, తాపం=తాపముగల, వింధ్యం=వింధ్య పర్వతమును, జలసేకైః-జల=జలముయొక్క, సేకైః = చల్లుటలచే, హ్లాదయంతీవ=సంతోషపెట్టుచున్నవివలె నున్నవి.

తా. ఈవింధ్యపర్వతము జలభారమును సహింపంజాలక బరువుచే వంగి పోయి వచ్చుచుండుమనకు గొప్ప ఆధారమై యుండుచుండును, ఉపకారము చేసినవానికి ఆపదలయందు ప్రత్యుపకారము సేయుట విధాయకమైనది అని తలంచినవోయన నీమేఘములు జలభారముచే నమ్రులై వచ్చి వర్షించి గ్రీష్మ ఋతువున మిగులం దీక్ష్ణమై ప్రవర్తిల్లినదావాగ్నిచే నార్తిం జెందుచుండు నీ వింధ్యపర్వతముయొక్క తాపము నుపశమింపం జేసి సంతోషపెట్టుచున్నట్లున్నవి.

బహుగుణరమణీయః కామినీచిత్తహారీ
తరువిటపలతానాం బాంధవో నిర్వికారః,
జలదసమయ ఏష ప్రాణినాం ప్రాణభూతో
దిశతు తవ హితాని ప్రాయశో వాంఛితాని. 28

టీ. బహుగుణరమణీయః-బహు = అనేకములగు, గుణ = గుణములచే, రమణీయః = రమణీయమైనదియు, కామినీచిత్తహారీ-కామినీ = కాముకరాంద్రకు, చిత్తహారీ=మనోహరమగునదియు, తరు...లతానాం-తరు = చెట్లయొక్క, విటప=కొమ్మలకును, లతానాం=తీఁగలకును, బాంధవః=బంధువగునదియు, నిర్వికారః=వికారములులేని, ప్రాణినాం = జంతువులకు, ప్రాణభూతః = ప్రాణమగు, ఏషః=ఈ, జలదసమయః=వర్షఋతువు, తవ=నీకు, హితాని = హితములగు, వాంఛితాని=కోరికలను, ప్రాయశః=తరుచుగా, దిశతు=ఇచ్చుగాక.

తా. ఓ ప్రేయసీ! ఈవర్షర్తువు కాముకరాంద్రకు కోరికల నింపున దగుట మిగుల మనోహరమైనది. తాపము నార్చి జలముల నొసంగునదగుట వృక్షంబులకును దీఁగలకును బంధువు. తాపము శీతము మొదలగు వికారంబులను గలిగింపనిది. ఆదానకాలమగుటచే సర్వజంతువులకును ప్రాణపోషకమైనది. ఇట్లనేకగుణంబుల కిరవై యొప్పునీవర్షర్తువు నీకిష్టములగుకోరికలం దీర్చి సుఖసంతోషము లొసంగుగాక.

ఇది మహాకవికాళిదాసవిరచితమగు ఋతుసంహారకావ్యమున
ప్రావృడ్వర్ణనంబను ద్వితీయసర్గము.



# తృతీయసర్గము



అవ. వర్షర్తువు నభివర్ణించిన యనంతరమున క్రమప్రాప్తమైన శరదృతువు నభివర్ణింపుచున్నాఁడు.—

శ్లో. కాశాంశుకా వికచపద్మమనోజ్ఞవక్త్రా
సోన్మాదహంసరవనూపురనాదరమ్యా,
ఆపక్వశాలిలలితానతగాత్రయష్టిః
ప్రాప్తా శర న్నవవధూరివ రూపరమ్యా. 1

టీ. కాశాంశుకా-కాశ = తెల్లనిరెల్లు, అంశుకా = వస్త్రముకలిగినదియు, వికచ ... వక్త్రా-వికచ=వికసించిన, పద్మ = తామరయనియెడు, మనోజ్ఞ= మనోహరమగు, వక్త్రా-ముఖముకలిగినదియు, సోన్మాద ... రమ్యా-సోన్మాద=మదముతోఁగూడిన, హంస=రాయంచలయొక్క, రవ=ధ్వనియనియెడు, నూపురనాద = అందెలచప్పుడుచే రమ్యా = రమ్యమైనదియు, ఆపక్వ ... యష్టిః-ఆపక్వ = అంతటనుపండిన, శాలి=వరియనియెడు, లలిత=మనోహరమైన, ఆనత = కొంచెమువంగిన, గాత్రయష్టిః-అంగయష్టికలిగినదియు, రూపరమ్యా = రూపముచే రమ్యముగనుండు, శరత్ = శరదృతువు, నవవధూరివ = క్రొత్తకోడలువలె, ప్రాప్తా=వచ్చెను.

తా. వర్షర్తువు గడచినవెంటనే మనోహరరూపములచేనుతయు రమ్యమై శరదృతువు వచ్చెను, దీని రాక సర్వాలంకారభూషితురాలగు క్రొత్తకోడలు త్తవారింటికి వచ్చునప్పటిరాక వలె నున్నది. ఎట్లన; ఈఋతువున తెల్లుపొద లన్నియుఁ బుష్పించి తెల్లనిపూవులతో నలరారుచున్నవి. ఇది తెల్లని వలువను ధరించి యుండుచందంబును దోపింపఁ జేయుచున్నది. పద్మములన్నియు వికసించి యున్నవి. దానిరీతి మనోహరమగు ముఖమును బోలియున్నది. హంసలన్నియు వర్షకాలము గడచుటచే మానసము నుండి తిరిగి వచ్చి మదించి

యఱచుచు నందెలచప్పుడా యనిపించుచున్నవి. పండి వంగియుండువరి శరదంగనగాత్రలత యని తోఁపింపఁ జేయుచున్నది. ఇట్లు దీనిరాక నూతనవధువు యొక్క ఆగమనమును పోలియున్నది.

కాశైర్మహీ శిశిరదీధితినా రజన్యో
హంసైర్జలాని సరితాం కుముదైస్సరాంసి,
సప్తచ్ఛదైః కుసుమభారనతైర్వనాన్తాః
శుక్లీకృతాన్యుపవనాని చ మాలతీభిః. 2

టీ. కాశైః=తెల్లఁబూవులచే, మహీ=భూమియు, శిశిరదీధితినా=చంద్రునిచే, రజన్యః=రాత్రులును, హంసైః=హంసలచే, సరితాం = నదులయొక్క, జలాని = జలములును, కుముదైః=కలువలచే, సరాంసి = సరస్సులును, కుసుమ...నతైః కుసుమ = పూవులయొక్క, భార = బరువుచే, నతైః=వంగిన, సప్తచ్ఛదైః=ఏడాకుల యనంటులచే, వనాంతాః=అడవిచోట్లును, మాలతీభిః=జాజులచే, ఉపవనాని = శృంగారవనములును, శుక్లీకృతాని = తెల్లగాఁ జేయఁబడినవి.

తా. తెల్లుపొద లన్నియుఁ బుష్పించి భూభాగమంతయుఁ దెల్లనై యున్నది. మేఘావరణ మడంగుటచే నుజ్జ్వలమగుచంద్రప్రకాశముచే రాత్రులు దెల్లనై యున్నవి. హంసలు గుంపుగుంపులై చరించుచుండుటచే నదీజలములు దెల్లనై యున్నవి. సరస్సులు గలువలచేఁ దెల్లగనున్నవి. బాగుగఁ బుష్పించి యుండు నేడాకులయనంటులచే వనప్రదేశములు దెల్లనై యున్నవి. జాజిపూవులచేఁ దోటలన్నియుఁ దెల్లనై యున్నవి. ఇట్టిఋతువునఁ బుష్పించు నానాపుష్పంబులచే నన్నిప్రదేశంబులును దెల్లనై యగపడుచున్నవి.

చఞ్చన్మనోజ్ఞశఫరీరశనాకలాపాః
పర్యన్తసంస్థితసితాణ్డజపఙ్క్తిహారాః,
నద్యో విశాలపులినాన్తనితమ్బబిమ్బాః
మన్దం ప్రయాన్తి ప్రమదాః ప్రమదా ఇవాద్య. 3

టీ. అద్య = ఇప్పుడు, చంచత్...కలాపాః - చంచత్ = ఒప్పుచుండెడు,...మనోజ్ఞ = మనోహరములగు, శఫరీ = శఫరు (ఎగిరిపడు స్వభావముగలచేఁప) లనెడు, రశనా = మొలపట్టీలయొక్క, కలాపాః = పంక్తులు కలిగినవియు, పర్యంత...హారాః - పర్యంత = సమీపములయందు, సంస్థిత= నిలిచియుండు, సిత = తెల్లనగు, అండజ = పక్షులయొక్క, పంక్తి = వరుస లనియెడు, హారాః = సరములు కలిగినవియు, విశాల...బింబాః - విశాల = విశాలములగు, పులినాంత=ఇసుకప్రదేశములనియెడు, నితంబబింబాః = నితంబ మండలములు కలిగిన, నద్యః = నదులు, సమదాః = మదముతోఁగూడిన, ప్రమదాఇవ = సుందరులవలె, మందం = మెల్లగా, ప్రయాంతి = పోవు చున్నవి.

తా. ఈఋతువున నదులన్నియు వేగమును ఔద్ధత్యమునువిడిచిమెల్లగాఁ బ్రవహించి పోవుచున్నవి. ఈగమనము మదవతు లగుప్రమదలవిలాసగమనంబులఁ బోలి యున్నది. ఈనదులయందు శఫరులనుమత్స్యంబులు దృశ్యపడుచున్నవి. అపాటు సుందరీమణుల రశనలమెదలికవలె నున్నది. ఉభయకూలంబులయందును తెల్లనిపక్షులు పంక్తులు దీరి నిలిచి యున్నవి. అయ్యవి విలాసినులహారములం బోలి యున్నవి. అచ్చటచట విశాలములగునిసుకతిన్నెలు గలభూములు కలవు. అవి స్త్రీలనితంబంబుల ననుకరించుచున్నవి.

వ్యోమ క్వచిద్రజతశఙ్ఖమృణాలగౌరై
స్త్యక్తామ్బుభిర్లఘుతయా శతశః ప్రయాతైః,
సంలక్ష్యతే పవనవేగచలైః పయోదైః
రాజేవ చామరవరైరుపవీజ్యమానః.　　4

టీ. వ్యోమ=ఆకాశము, క్వచిత్=ఒకచోట, రజత...గౌరైః - రజత వెండివలెను, శంఖ=శంఖమువలెను, మృణాళ=తామరతూడువలెను, గౌరైః = తెల్లనైనవియు, త్యక్తాంబుభిః-త్యక్త=విడవఁబడిన, అంబుభిః = జలములు కలిగినవియు, లఘుతయా=తేలికయగుటచేత, శతశః=నూర్లునూర్లుగా, ప్రయాతైః

=విడిపోయినవియుం, పవన...చలైః-పవన=గాలియొక్క, వేగ = వేగముచేత, చలైః=కదలుచుండు, పయోదైః= మేఘములచేత, చామరవరైః = శ్రేష్ఠములగు చామరములచే, ఉపవీజ్యమానః=వీవఁబడుచుండు, రాజేవ = రాజువలె, సంలక్ష్యతే = కనఁబడుచున్నది.

తా. మేఘములు వర్షర్తువునందుఁ బూర్ణముగ వర్షించుటచే నిప్పుడు జలశూన్యములై కొన్నిచోటుల వెండివలెను మఱికొన్నిచోటుల శంఖమువలెను ఇంకఁ గొన్నిచోటుల తామరతూడులవలెను పరస్పరము కొంచెముగ భేదించియుండు తెలఁపుకాంతి గలిగి యున్నవి. మఱియుం నీటి బరువు లేకుండుటచే అనేకభాగములు గలిగిపోయి గాలికి మెల్లగఁ గదలుచున్నవి.ఇట్టి మేఘముల కదలికచే నాకాశము చామరములచే వీవఁబడుచుండురాజువలె నగుపడుచున్నది.

భిన్నాఞ్జనప్రచయకాన్తి నభో మనోజ్ఞం
బన్ధూకపుష్పరచితారుణతా చ భూమిః,
వప్రాశ్చ చారుకమలావృతభూమిభాగాః
ప్రోత్కణ్ఠయన్తి న మనో భువి కస్య యూనః. 5

టీ. భిన్న...కాంతి—భిన్న = నూరఁబడిన, అంజనప్రచయ=కాటుకముద్దయొక్క, కాంతి=కాంతివంటి కాంతికలిగినదియు, మనోజ్ఞం = మనోహరమగు, నభః = ఆకాశమును, బంధూక...అరుణతా-బంధూకపుష్ప = మంకెనపూవులచే, రచిత = నిర్మింపఁబడిన, అరుణతా = ఎఱుపుకలిగిన, భూమిశ్చ = భూమియుం, చారు...భాగాః-చారు = మనోహరములగు, కమల = తామరపూవులచే, ఆవృత = చుట్టఁబడిన, భూమిభాగాః = భూప్రదేశములు కలిగిన, వప్రాశ్చ = చఱియలక్రిందిప్రదేశములును, భువి = భూమియందు, కస్య=ఏ, యూనః = యౌవనకుని, మనః = మనస్సును, నప్రోత్కంఠయంతి = వేడుకపఱచుచుండలేదు.

తా. నూరఁ బడినకాటుకముద్దవలె నల్లనగునాకాశమును, అంతటను బూచి యుండుమంకెనపూవుల రంగుచే నెఱ్ఱనగు భూభాగమును, తామరలచే

మనోహరములైన కొండచరియలదిగువ నుండుసమప్రదేశములును యౌవన వంతుల మనసుల నలరఁజేయుచు వారి కుతుకంఠను గలిగింపుచున్నవి.

శ్లో. మన్దానిలాకులితచారుతరాగ్రశాఖః
పుష్పోద్గమప్రచయకోమలపల్లవాగ్రః,
మత్తద్విరేఫపరిపీతమధుప్రసేకః
చిత్తం విదారయతి కస్య న కోవిదారః. 6

టీ. మంద...శాఖః-మంద=మందతగల, అనిల = వాయువుచే, అకులి త=కదల్పఁబడిన, చారుతర=మిగులసుందరములగు, అగ్రశాఖః = కొనకొమ్మలు కలదియు, పుష్ప...అగ్రః-పుష్ప=పూవులయొక్క, ఉద్గమ = ప్రాదుర్భావము యొక్క, ప్రచయ=అధిక్యముచేత, కోమల=కోమలములగు, పల్లవాగ్రః=చిగు ళ్ళ చివరలుకలదియు, మత్త...ప్రసేకః-మత్త=మదించిన,ద్విరేఫ=తుమ్మెదలచే, పరిపీత=త్రాగఁబడిన. మధు = పూఁదేనెయొక్క, ప్రసేకః = కారుడుగలిగిన, కోవిదారః = ఎఱ్ఱకాంచనపుచెట్టు, కస్య=ఎవ్వని, చిత్తం=మనసును, నవిదార యతి = పగుల్చుచుండలేదు.

తా. మెల్లనిగాలి వీచుచుండుటచే మిగుల సుందరములై యుండు కొమ్మలచివరభాగములు కదలుచుండ, అధికముగ పూవు లుదయించుటచే మృదువులగు చిగుళ్ళచే నొప్పుచు, పూవులనుండి స్రవించుచుండు తేనెను దుమ్మెదలు ద్రాగుచుండ మనోహరముగ నుండు నెఱ్ఱకాంచనపుచె ట్టెవరిమనసుల యందు కామాగ్నిని రగులుకొలిపి బాధింపుచుండలేదు? (అందఱిమనసులను బాధింపుచున్నదనుట.)

తారాగణప్రవరభూషణముద్వహన్తీ
మేఘావరోధపరిముక్తశశాంకవక్త్రా,
జ్యోత్స్నాదుకూలమమలం రజనీ దధానా
వృద్ధిం ప్రయాత్యనుదినం ప్రమదేవ బాలా.

టీ. తారా...భూషణం-తారా = నక్షత్రముల, గణ=సమూహమని యెడు, ప్రవర=ఉత్తమమగు, భూషణం=అలంకారమును, ఉద్వహంతీ = ధరించియుండు నదియు, మేఘ...వక్త్రా-మేఘ = మేఘములయొక్క, అవరోధ= ముసుఁగునుండి, పరిముక్త=విడువఁబడిన, శశాంక = చంద్రుఁడనియెడు, వక్త్రా= ముఖముకనిగినదియుఁ, అమలం=స్వచ్ఛమగు, జ్యోత్స్నాదుకూలం, జ్యోత్స్నా =వెన్నెలయనియెడు, దుకూలం=పట్టుచీరను, దధానా=ధరించియుండు, రజనీ= రాత్రి, బాలా=బాలికయగు, ప్రమదేవ=స్త్రీవలె, అనుదినం = ప్రతిదినమును, వృద్ధిం=వృద్ధిని, ప్రయాతి=పొందుచున్నది.

తా. శరద్రాత్రి నవయౌవనోదయమగుచు దినదినమును లావణ్యంబునువిలాసంబులును పెరుగుచుండ వృద్ధిఁబొందుబాలికామణింబోలి యనుదినమును వృద్ధియగుచున్నది. బాలికతో నీరాత్రికి పోలిక యెట్లన? యౌవనోదయమగుచుండుబాలిక ఉత్తమరత్నాభరణంబులఁ దొడిగికొనును. అట్లే యిది యుంనక్షత్రము లనుసుత్తమరత్నాభరణంబులు ధరియించి యున్నది. ఆమె మేఘమువలె తనముఖమునావరించియుండు ముసుగునుండి తొలఁగింపబడును. (ఇది దేశీయము). ఇదియుం మేఘ మనియెడు ముసుగునుండి తొలఁగినచంద్రుఁడను ముఖముతో నొప్పుచున్నది. ఆమె వెన్నెలవలె తెల్లనివలువల ధరింప నారంభించును! ఇదియుం వెన్నెలయనియెడు దువ్వలువను ధరింప నారంభించినది. ఇట్లు శరద్రాత్రి యౌవనారంభంబున నుండుబాలికం బోలి యున్నది.

కారణ్డవాననవిఘట్టితవీచిమాలాః
కాదమ్బసారసచయాకులతీరదేశాః,
కుర్వన్తి హంసవిరుతైః పరితో జనస్య
ప్రీతిం సరోరుహరజోరుణితా స్తటిన్యః. 8

టీ. కారండవ...మాలాః-కారండవ=కన్నెలేడిపిట్టల, ఆనన = ముక్కులచే, విఘట్టిత=పొడువఁబడిన, వీచి=తరంగములయొక్క, మాలాః = పంక్తులు కలిగినవియుం, కాదంబ...దేశాః-కాదంబ=కలహంసలయొక్కయుం, సారస =

బెగ్గురుపక్షులయొక్క-యు, చయ=సమూహముచే, ఆకుల=వ్యాకులమగు తీర దేశాః=దరులుకలిగినవియు, సరోరుహరజోరుణితాః-సరోరుహ = పద్మముల యొక్క-, రజః=పుప్పొడిచే, అరుణితాః=ఎఱ్ఱఁగఁ జేయఁబడిన, తటిన్యః=నదులు, హంసవిరుతైః=హంసలకూతలచే, పరితః=చుట్టును, జనస్య=జనులకు, ప్రీతిం= సంతసమును, కుర్వంతి=చేయుచున్నవి.

తా. వర్షఋతువున జలములు కలుషములై ప్రవాహవేగ మధికమై యుండుటచే నెవ్వరికిని దగ్గఱఁ జేరవెఱపిచ్చుచుండిన నదు లిప్పుడు ప్రవాహము దగ్గి జలములు నిర్మలములై యుండుటచే సర్వజంతువులకు నపేక్షణీయములును పొందదగినవియు నై యొప్పుచున్నవి. కావున కన్నెలేడిపిట్టలు తరంగంబుల యందుఁ గొట్టుకొని వచ్చునాహారాదులను గ్రహించుటకై యాతరంగ పంక్తుల ముక్కులతోఁ బొడుచుచున్నవి. దరులయందంతటను కలహంసలును బెగ్గురులును బారలు దీరి నిలిచి యున్నవి. వర్షకాలముగలించుటచేఁ దామరలెల్లఁ గొల్లలుగఁ బూచినవగుట నాపొడియంతయును రాలి నీరంతయును నెఱ్ఱగ నగు పడుచున్నది. ఇట్లు మనోహరములై యుండునదీప్రదేశము లాయాచుట్టుపట్ల నుండువారికి హంసధ్వనులచేసంతసము నొడగూర్చుచున్నవి.

శ్లో. నేత్రోత్సవో హృదయహారిమరీచిమాలః
ప్రహ్లాదకః శిశిరసీకరవారివర్షీ,
పత్యుర్వియోగవిషదిగ్ధశరక్షతానాం
చంద్రో దహత్యతితరాం తనుమంగనానామ్. ౧

టీ. నేత్రోత్సవః-నేత్ర=కనులకు, ఉత్సవః=ఉత్సవమైన, హృదయ ...మాలః-హృదయహారి=మనోహరమైన, మరీచి=కిరణములయొక్క-.మాలః= సమూహముకలిగినట్టియు. ప్రహ్లాదకః=మిగులసంతసమును కలిగించునట్టియు, శిశిర...వర్షీ-శిశిర=చల్లని, సీకరవారి=జలబిందువులను, వర్షీ=వర్షించునట్టి, చంద్రః=చంద్రుఁడు, పత్యుః=ప్రియునియొక్క-, వియోగ...క్షతానాం-వి యోగ=వియోగమను, విష=విషముచే, దిగ్ధ=పూయఁబడిన, శర=బాణములచే,

హతానాం=కొట్టఁబడిన, అంగనానాం = స్త్రీలయొక్క, తనుం=శరీరమును, దహతి = దహించుచున్నాఁడు.

తా. ఇప్పుడు మేఘావరణము నశించుటచేఁ జంద్రుఁడీశరద్రాత్రుల యందు మనోహరము లగుకిరణములం బ్రసరింపఁ జేయుచు నందఱికినిఁ గనుల పండువయై చల్లనిజలబిందువుల విడుచుచు సంతోషజనకుఁడై యున్నాఁడు. ప్రియులతో వియోగమును బొంది మన్మథుబారిం బడి పరితపించుచుండుసుందరులకీచంద్రుఁడు పరితాపమును బొందించుచున్నాఁడు.

శ్లో. ఆకమ్పయ న్ఫలభరానతశాలిజాలా
నానర్తయం స్తరువరా న్కుసుమావనమ్రాన్,
ఉత్ఫుల్లపఙ్కజవనాం నళినీం విధున్వన్
యూనాం మనశ్చలయతి ప్రసభం నభస్వాన్. 10

టీ. ఫల...జాలాన్-ఫల = పండ్లయొక్క, భర=బరువుచే ఆనత=వంగిన, శాలి=వరియొక్క, జాలాన్=సమూహములను, ఆకంపయన్=కదల్చుచు, కుసుమావనమ్రాన్-కుసుమ=పూవులచే, అవనమ్రాన్=వంగిన, తరువరాన్=వృక్షరాజములను, ఆనర్తయన్=ఆడించుచు, ఉత్ఫుల్ల...వనాం-ఉత్ఫుల్ల=వికసించిన, పంకజ = పద్మములయొక్క, వనాం=అడవికలిగిన, నళినీం=తామరను, విధున్వన్=మెదల్చుచు, నభస్వాన్=వాయువు. యూనాం=యౌవనుల, మనః=మనస్సును, ప్రసభం=బలాత్కారముగా, చలయతి=చలింపఁజేయుచున్నది.

తా. పూర్ణముగాఁ బండి వెన్నులబరువుచే వంగియుండువరిచేలను ఊచి యుండు చెట్లను కమలములచే విరాజిల్లుచుండు తామరలను గదలింపుచు వీచుచుండు శరద్వాయువులు దరుణవయస్కులమనస్సులయం దుత్సాహము గదురంజేసి వారిమనస్సులు చలించునట్లు చేయుచున్నవి.

శ్లో. సోన్మాదహంసమిథునై రుపశోభితాని
స్వచ్ఛాని ఫుల్లకమలోత్పలభూషితాని,

మన్దప్రభాతపవనోద్గతవీచిమాలా
న్యుత్కంఠయన్తి సహసా హృదయం సరాంసి.   11

టీ. సోన్మాద ..మిథునైః-సోన్మాద=మదముతోఁగూడిన, హంస=హంసలయొక్క, మిథునైః=జంటలచేత, ఉపశోభితాని=అలంకరింపచేయబడినవియుం, ఫుల్ల...భూషితాని-ఫుల్ల=వికసించిన, కమల=పద్మములచేతను, ఉత్పల=కలువలచేతను, భూషితాని=అలంకరింపఁబడినవియు, మంద...మాలాని-మంద=మెల్లనగు, ప్రభాతపవన=ప్రాతఃకాలవాయువులచే, ఉద్గత=బయలువెడలిన, వీచి=తరంగములయొక్క. మాలాని=పఙ్క్తులుకలిగినవియు, స్వచ్ఛాని=స్వచ్ఛములగు, సరాంసి=సరస్సులు, హృదయం=మనస్సును, సహసా=బలాత్కారముగా, ఉత్కంఠయంతి=వేడుకగలదిగఁ జేయుచున్నవి.

తా. హంసలు మదించి జంటలుజంటలై సంచరించుచుండ వికసించిన కమలములును గలువలును రాజిలుచుండ మెల్లనిప్రాతర్వాయువులచేఁ దరంగములు వెడలుచుండ స్వచ్ఛములై యుండుసరస్సులు చూడ వేడుకలై యున్నవి.

శ్లో. నష్టం ధను ర్బలభిదో జలదోదరేషు
సౌదామినీ స్ఫురతి నాద్య వియత్పతాకా,
ధున్వన్తి పక్షపవనైః న నభో బలాకాః
పశ్యన్తి నోన్నతముఖా గగనం మయూరాః.   12

టీ. అద్య=ఇప్పుడు,జలదోదరేషు-జలద=మేఘములయొక్క,ఉదరేషు=గర్భములయందలి, బలభిదః=ఇంద్రుని, ధనుః=ధనుస్సు, నష్టం=నశించినది. వియత్పతాకా-వియత్ = ఆకాశమునకు, పతాకా=ధ్వజమగు, సౌదామినీ=మెఱుపు, నస్ఫురతి=స్ఫురింపుచుండలేదు. బలాకాః=బెగ్గురులు, పక్షపవనైః=ఱెక్కలగాలిచే, నభః=ఆకాశమును, నధున్వంతి=కదల్చుచుండలేదు. మయూరాః=నెమిళ్లు, ఉన్నతముఖాః-ఉన్నత=ఎత్తఁబడిన, ముఖాః=ముఖములుగలవై, గగనం=ఆకాశమును, నపశ్యంతి=చూచుచుండలేదు.

తా. వర్షఋతువునందు మేఘములయందంతట నగపడుచుండిన ఇంద్ర ధనుస్సు ఇప్పుడు నశించిపోయినది. అప్పుడాకాశంబునకుఁ బతాకము వలె నుండిన మెఱపు ఇప్పుడు కనుపడుటలేదు. గర్భాధానక్షణపరిచయమువలన నప్పుడాకాశమున పంక్తులు దీర్చి సంచరింపుచు ఱెక్కలగాలిని వ్యాపింపఁ జేయుచుండు బెగ్గురుపక్షులు ఇప్పుడాపనిని మానినవి. జలధరములు లేమింజేసి నెమిళ్లు తలలెత్తి యాకాశమువైపు చూచుటను మానినవి.

శ్లో. నృత్యప్రయోగరహితాఞ్ఛిఖినో విహాయ
హంసా నుపైతి మదనో మధురప్రగీతాన్,
ముక్త్వా కదమ్బకుటజార్జునసర్జనీపాన్
సప్తచ్ఛదా నుపగతా కుసుమోద్గమశ్రీః. 13

టీ. మదనః=మన్మథుఁడు, నృత్యప్రయోగరహితాన్-నృత్య=నాట్యముయొక్క, ప్రయోగ=ప్రయోగముచే, రహితాన్=శూన్యములగు, శిఖినః=నెమిళ్ళను, విహాయ=విడిచి, మధురప్రగీతాన్-మధుర=సొంపగు, ప్రగీతాన్=గానములుగల, హంసాన్=హంసలను,ఉపైతి=పొందుచున్నాఁడు. కుసుమ... శ్రీః-కుసుమ=పుష్పములయొక్క, ఉద్గమ=ఉదయముయొక్క, శ్రీః=లక్ష్మి, కదమ్బ...నీపాన్-కదంబ=కడిమచెట్లను, కుటజ=కొడిశచెట్లను, అర్జున=మద్దిచెట్లను, సర్జ=ఏపిచెట్లను, నీపాన్ = మొగులుకడిమచెట్లను, ముక్త్వా = విడిచి, సప్తచ్ఛదాన్ = ఏడాకులఅరటిచెట్లను, ఉపగతా=పొందినది.

తా. వర్షఋతువున నెమిళ్ళు పురులు విప్పి యాడుచు మన్మథోద్దీపకములై యుండెడివి. ఇప్పుడు హంసలు మధురగానంబులు సేయుచు కామస్థానంబులై మదనోద్దీపకములై యున్నవి. అప్పుడు కడిమ కొడిశ మద్ది ఏపి మొదలగువృక్షజాతులు పుష్పించి శోభాయమానములై యుండెడివి. ఇప్పుడు ఏడాకులయనంటులయందాలక్ష్మి ప్రవేశించుచున్నది.

శ్లో. శేఫాలికాకుసుమగన్ధమనోహరాణి
స్వస్థస్థితాణ్డజకులప్రతినాదితాని,

పర్యన్తసంస్థితమృగీనయనోత్పలాని
ప్రోత్కణ్ఠయన్త్యుపవనాని మనాంసి పుంసామ్. 14

టీ. శేఫాలికా...మనోహరాణి - శేఫాలికాకుసుమ=నల్లవావిలిపూవులయొక్క, గంధ=సువాసనచే, మనోహరాణి=మనోహరములగు నవియు, స్వస్థ...ప్రతినాదితాని-స్వస్థ=స్వస్థములై, స్థిత=ఉండెడి, అండజ=పక్షులయొక్క, కుల=సమూహములచే, ప్రతినాదితాని=ప్రతిధ్వనింపఁజేయఁబడినవియు,పర్యంత...ఉత్పలాని-పర్యంత=సమీపమున, సంస్థిత = ఉండెడి, మృగీ = లేళ్ళయొక్క, నయన=కండ్లనియెడు, ఉత్పలాని=కలువలఁకలిగిన, ఉపవనాని=శృంగారపుఁదోటలు, పుంసాం=పురుషుల, మనాంసి = మనసులను, ఉత్కంఠయన్తి = వేడుక నందింపుచున్నవి.

తా. ఈఋతువున నుద్యానంబులయందు నల్లవావిలిపూలవాసన యెల్లయెడల వ్యాపించి యున్నవి. గ్రీష్మాదులయందు వలె నెండ దావాగ్ని మొదలగుబాధలు లేకుండుటచే స్వస్థముగ నుండుపక్షు లన్నియుఁ నుత్సాహముతోఁగలయఁచుఁ బ్రతిధ్వనులు గలుగునట్లుచేయుచున్నవి. మేఁతకొఱకుఁ దోఁటల దరికి వచ్చియుండులేళ్ళమనోహరములగు చూపులు గనుపడుచున్నవి. ఇట్లు మనోహరములగుతోఁటలు చూచువారికి వేడుకఁ గలిగించుచున్నవి.

శ్లో. కల్హారపద్మకుముదాని ముహుర్విధున్వ
న్తత్సంగమాదధికశీతలతాముపేతః,
ఉత్కంఠయత్యతితరాం పవనః ప్రభాతే
పత్రాన్తలగ్నతుహినామ్బువిధూయమానః. 15

టీ. ప్రభాతే=ప్రాతఃకాలమునందలి, పవనః = వాయువు, కల్హారపద్మకుముదాని-కల్హార=ఎఱ్ఱగలువలను, పద్మ=కమలములను, కుముదాని=తెల్లగలువలను, ముహుః=అడుగడుగునకును, విధున్వన్=కదలించుచు, తత్సంగమాత్ = వానిసంబంధమువలన, అధికశీతలతాం-అధిక = అధికముగ, శీతలతాం = చల్లదనమును, ఉపేతః=పొందినదై, పత్ర...అంబు-పత్ర=ఆకులయొక్క, అంత =

కొనలయందు, లగ్న=తగులుకొనియుండు, తుహిన = మంచుయొక్క, అంబు= జలమును, విధూయమానః = రాల్చుచు, అతితరాం=మిక్కిలి, ఉత్కంఠయతి =వేడుకఁజేయుచున్నది.

తా. ప్రాతర్వాయువు లీఋతువున నధికముగఁ బుష్పించి యుండుట నెత్తగలువలు తెల్లగలువలు దామరలు మొదలగువానిని గదల్చుచు నాపుష్పములసంబంధముచేఁ జల్లనై రాత్రిఁబడిన మంచుబిందువులుచెట్లయాకుకొనలయం దుతగులుకొని యుండ వానిని రాల్చుచు మిగుల నుత్సాహజనకమై యున్నది.

శ్లో. సంపన్నశాలినిచయావృతభూతలాని
స్వస్థస్థితప్రచురగోకులశోభితాని,
హంసైః ససారసకులైః ప్రతినాదితాని
సీమాన్తరాణి జనయన్తి నృణాం ప్రమోదమ్. 16

టీ. సంపన్న... భూతలాని-సంపన్న=సమృద్ధములగు, శాలినిచయ=వరి సమూహములచే, ఆవృత=ఆవరింపఁబడిన, భూతలాని = భూభాగములుకలిగినవి యును, స్వస్థ...శోభితాని-స్వస్థ=స్వస్థములై, స్థిత=ఉండిన, ప్రచుర = అధికము లైన, గోకుల = గోసమూహములచే, శోభితాని=ప్రకాశింపఁజేయఁబడినవియును, ససారసకులైః=బెగ్గురులతోఁగూడిన, హంసైః = హంసలచే, ప్రతినాదితాని = ప్రతిధ్వనింపచేయబడిన, సీమాన్తరాణి - సీమా = సరిహద్దుల, అంతరాణి = మధ్యభాగములు, నృణాం=జనులకు, ప్రమోదం=సంతోషమును, జనయంతి= పుట్టించుచున్నవి.

తా. ఈఋతువునఁ బొలిమేరలమధ్యభాగములయం దెచ్చటఁ జూచిన నుభూములన్నియుఁ బూర్ణముగఁబండి సమృద్ధములగువరిపొలములతో నిండి యున్నవి. స్వస్థములై మందలుమందలుగఁ బెరిగి గోగణములు గనుపట్టుచు న్నవి. హంసలను బెగ్గురులను జేరి ధ్వనించుచున్నవి. ఇట్లు ఎచ్చటఁ గనిన సమృద్ధిదోచుచుండుటచేఁ బొలిమేరల మధ్యభాగములు చూచువారలకు సంతో షమును గలిగించుచున్నవి.

శ్లో. హంసైర్జితా సులలితా గతిరంగనానా
మంభోరుహైర్వికసితైర్ముఖచన్ద్రకాన్తిః,
నీలోత్పలైర్మదకలాని విలోకితాని
భ్రూవిభ్రమాశ్చ రుచిరాస్తనుభిస్తరంగైః. 17

టీ. అంగనానాం=స్త్రీలయొక్క, సులలితా = మిగులమనోహరమగు, గతిః=గమనము, హంసైః=హంసలచే, జితా = జయింపఁబడెను. ముఖచంద్రకాంతిః-ముఖచంద్ర = చంద్రునివంటిముఖములయొక్క, కాంతిః=కాంతి, వికసితైః=వికసించిన, అంభోరుహైః=పద్మములచే, జితా=జయింపఁబడెను. మదకలాని-మద=మదముచే, కలాని=మధురములగు, విలోకితాని=చూపులు, నీలోత్పలైః=నల్లగలువలచే, జితాని = జయింపఁబడినవి. రుచిరాః = మనోహరములగు, భ్రూవిభ్రమాః = కనుబొమలవిలాసములు, తనుభిః=సూక్ష్మములగు, తరంగైః=తరంగములచే, జితాః = జయింపఁబడెను.

తా. స్త్రీలగమనసౌందర్యమును హంసలగమనసౌందర్యము మించుచున్నది. స్త్రీలముఖకాంతిని వికసించినపద్మములకాంతి మించుచున్నది. మదాతిరేకముచేఁ జూడ నింపులై యుండు స్త్రీలచూపులయందలిశోభను నల్లగలువల శోభ మించుచున్నది. కనుబొమలవిలాసములను సూక్ష్ములై బయలువెడలుచుండునదులు మొదలగువానియందలి తరంగములవిలాసములు మించుచున్నవి. ఇట్లే ఋతువున ప్రకృతియొక్క సౌందర్యమంతయు సర్వోత్తరమని ప్రసిద్ధిఁజెందిన స్త్రీసౌందర్యమును గూడ మించుచున్నది.

శ్లో. శ్యామా లతాః కుసుమభారనతప్రవాళాః
స్త్రీణాం హరన్తి ధృతభూషణబాహుకాన్తిమ్,
దన్తావభాసవిశదస్మితవక్త్రకాన్తిం
కఙ్కేళిపుష్పరుచిరా నవమాలతీ చ. 18

టీ. కుసుమ... ప్రవాళాః-కుసుమ=పూవులయొక్క, భార=బరువుచేత, నత=వంగిన, ప్రవాళాః=చిగురులుఁగలిగిన, శ్యామాః = నల్లని, లతాః=తీగలు,

స్త్రీణాం=స్త్రీలయొక్క, ధృత...కాంతిం=ధృత=ధరించఁబడిన, భూషణ=అలంకరణములుగల, బాహు=బాహువులయొక్క, కాంతిం=శోభను, హరన్తి=హరించుచున్నవి. కంకేళిపుష్పరుచిరా-కంకేళిపుష్ప=అశోకపుపూవులచే, రుచిరా=మనోహరమగు, నవమాలతీచ-క్రొత్తజాజిపూవులును, దన్త...కాంతిం-దంత=దంతములయొక్క, అవభాస=కాంతిచే, విశద=స్వచ్ఛమగు, స్మిత=చిఱునగవుకలిగిన, వక్త్ర=ముఖముయొక్క, కాంతిం=కాంతిని, హరతి=హరించుచున్నది.

తా. పూవులతోఁగూడి చిగుళ్ల చివరలయందుండి వంగి యుండు లతలు రత్నాంగుళీయాద్యాభరణములను ధరించియుండు సుందరాంగనల బాహువులం బోలుచున్నవి. అశోకపుష్పముతోఁ గూడి మనోహరమగు తెల్లని కాంతితో నొప్పుజాజులు దంతకాంతితోఁగూడిన చిరునగవుతో నొప్పు ముఖముల ననుసరించుచున్నవి.

శ్లో. కేశాన్నితాన్తఘననీలవికుఞ్చితాగ్రా
నాపూరయన్తి వనితా నవమాలతీభిః,
కర్ణేషు చ ప్రవరకాంచనకుట్మలేషు
నీలోత్పలాని వివిధాని నివేశయన్తి. 19

టీ. వనితాః = స్త్రీలు, నితాంత...అగ్రాన్-నితాంత=మిగుల, ఘన = దట్టమైన, నీల=నల్లనైన, వికుంచిత = ముడువఁబడిన, అగ్రాన్ = చివరలుకలిగిన, కేశాన్=వెండ్రుకలను, నవమాలతీభిః=క్రొత్తజాజిపూవులచే, ఆపూరయంతి = నింపుచున్నారు. ప్రవర...కుట్మలేషు - ప్రవర=శ్రేష్ఠములగు, కాంచనకుట్మలేషు=బంగరుకమ్మలుగల, కర్ణేషు=చెవులయందు, వివిధాని=నానావిధములగు, నీలోత్పలాని=నల్లగలువలను, నివేశయన్తి=ప్రవేశపెట్టుచున్నారు.

తా. ఈఋతువున వనితలు నల్లనై యెత్తుగ నుండుతమవెండ్రుకల చివరలను ముడిచికొని అందు జాజిపూవుల నంతటఁ దురుముకొనుచున్నారు. చెవులయందు బంగరుకమ్మలను ధరించి వానితోఁ గూడ నల్లగలువల ననేకరీతుల రచించి ధరించుచున్నారు.

శ్లో. హారైః సచన్దనరసైః స్తనమణ్డలాని
శ్రోణీతటం సువిపులం రశనాకలాపైః,
పాదాంబుజాని కలనూపురశేఖరైశ్చ
నార్యః ప్రహృష్టమనసోఽద్య విభూషయన్తి. 20

టీ. అద్య = ఇప్పుడు, ప్రహృష్టమనసః = సంతసించిన మనస్సుగల నార్యః=స్త్రీలు, సచందనరసైః=చందనద్రవముతోఁ గూడిన, హారైః = హారములతో, స్తనమండలాని=స్తనప్రదేశములను, రశనాకలాపైః-రశనా = మొల కట్టీలయొక్క, కలాపైః = కలాపములచేత, సువిపులం = మిగుల విశాలమగు, శ్రోణీతటం=పిఱుఁదుల ప్రదేశములను, కలనూపురశేఖరైః-కల = మధురములగు, నూపురశేఖరైః=శ్రేష్ఠములగు నూపురములచే, పాదాంబుజాని = పాదపద్మములను, విభూషయంతి=అలంకరించుచున్నారు.

తా. ఈఋతువున నంగన లుత్సాహవతులై స్తనమండలములయందు చందనద్రవములను రత్నాదిహారములను ధరించుచున్నారు. గొప్ప పిరుఁదులపై మొలదట్టీలను ధరించుచున్నారు. మనోహరములగు నందెలచే పాదపద్మముల నలంకరించుచున్నారు, ఇట్లు కామిజనసంతోషదాయకముగ నీఋతు వల రారుచున్నది.

శ్లో. స్ఫుటకుముదచితానాం రాజహంసాశ్రితానాం
మరకతమణిభాసా వారిణా భూషితానామ్,
శ్రియమతిశయరూపాం వ్యోమ తోయాశయానాం
వహతి విగతమేఘం చంద్రతారావకీర్ణమ్. 21

టీ. స్ఫుట...చితానాం-స్ఫుట=వికసించిన, కుముద = తెల్లగలువలచే, చితానాం=వ్యాపించఁబడినవియు, రాజహంసాశ్రితానాం-రాజహంస = రాజహంసలచే, ఆశ్రితానాం=ఆశ్రయించఁబడినవియు, మరకతమణిభాసా-మరకతమణి=మరకతమణియొక్క, భాసా=కాంతివంటి కాంతికలిగిన, వారిణా = జలముచే, భూషితానాం=అలంకరింపఁబడిన, తోయాశయానాం=జలాధారప్రదే

శములయొక్క, అతిశయరూపాం=అధికమగు, శ్రియం = శోభను, విగతమే ఘం-విగత=పోయిన, మేఘం=మేఘములు కలిగిన, చంద్ర...అవకీర్ణం-చంద్ర=చంద్రునిచేతను, తార=నక్షత్రములచేతను, అవకీర్ణం=వ్యాప్తమైన, వ్యోమ=ఆకాశము, వహతి=వహించుచున్నది.

తా. ఈఋతువున వికసించినకలువలతోడను రాజహంసలతోడను వ్యాప్తములై మరకతమణులవంటి నల్లనికాంతి గల జలముతో నొప్పుచుండు తటాకములు మొదలగు జలాధారదేశములును, మేఘావరణము లేకుండుటచే నల్లనైన నక్షత్రములచేతను చంద్రాదిగ్రహములచేతను వ్యాప్తములై యుండు నాకాశమును సమానమగుశోభను వహించియున్నది.

శరది కుముదసఙ్గాద్వాయవో వాన్తి శీతా
విగతజలదబృందా దిగ్విభాగా మనోజ్ఞాః,
విగతకలుషమమ్భః శ్యానపఙ్కా ధరిత్రీ
విమలకిరణచన్ద్రం వ్యోమ తారావిచిత్రమ్. 22

టీ. శరది = శరదృతువునందు, కుముదసంగాత్ - కుముద = కలువల యొక్క, సంగాత్=సంబంధమువలన, వాయవః=వాయువులు, శీతాః = చల్లనివై, వాంతి=వీచుచున్నవి. విగత...బృందాః - విగత = పోయిన, జలద=మేఘములయొక్క, బృందాః=సమూహములుకలిగిన, దిగ్విభాగాః-దిక్=దిక్కుల యొక్క, విభాగాః = ప్రదేశములు, మనోజ్ఞాః = మనోహరములైనవి, అంభః = జలము, విగతకలుషం = పోయినకలుషముకలదై యున్నది. ధరిత్రీ = భూమి, శ్యానపంకా=ఎండినబురదకలదై యున్నది. వ్యోమ = ఆకాశము, విమల...చంద్రం-విమల=స్వచ్ఛమైన, కిరణ = కిరణములుకలిగిన, చంద్రం= చంద్రుడుకలిగినదిగను, తారావిచిత్రం-తారా=నక్షత్రములచే, విచిత్రం = విచిత్రమైనదిగ నున్నది.

తా. ఈశరదృతువునందు వాయువు కలువలతోఁ గలిగియుండుటచేఁ జల్లగ వీచుచుండును. ఎచ్చటను మేఘావరణముండదు. కావున దిక్ప్రదేశము

లన్నియుఁ మనోహరములై కన్పట్టును. జలములయందు కాలుష్య మడంగును. భూమియందలిబురద లారును. ఆకాశమున చంద్రుఁడు స్వచ్ఛమైనకిరణములతో నలరారుచుండును. తారలన్నియు వెలసి విచిత్రములై యుండును.

దివసకరమయూఖై ర్బోధ్యమానం ప్రభాతే
వరయువతిముఖాభం పఙ్కజం జృంభతేఽద్య,
కుముదమపి గతేఽస్తం లీయతే చన్ద్రబిమ్బే
హసితమివ వధూనాం ప్రోషితేషు ప్రియేషు. (23)

టీ. అద్య=ఇప్పుడు, దివసకరమయూఖైః-దివసకర=సూర్యునియొక్క, మయూఖైః=కిరణములచే, బోధ్యమానం = వికసింపఁజేయఁబడుచుండు, పంకజం=పద్మము, ప్రభాతే = ప్రాతఃకాలమున. వర . ఆభం-వర = శ్రేష్ఠురాలగు, యువతి = యౌవనవతియొక్క, ముఖ = ముఖముయొక్క, ఆభం = కాంతివంటికాంతి కలిగినదై, జృంభతే = వికసించుచున్నది. చంద్రబింబే = చంద్రబింబము, అస్తంగతే = అస్తమయమయినదైయుండఁగా, కుముదమపి = కలువయును, ప్రియేషు ప్రియులు, ప్రోషితేషు = ప్రయాణము వెడలినవారైయుండఁగా, వధూనాం=స్త్రీలయొక్క, హసితమివ = నవ్వువలె, లీయతే=ముడుగుచున్నది.

తా. ఇప్పుడు పద్మములు సూర్యోదయసమయమున సూర్యకిరణములచే వికసింపఁజేయఁబడుచు నుత్తమాంగనలముఖమువంటి కాంతితో వికసింపుచున్నవి. కలువలును చంద్రుఁడస్తమించినంతనే తమప్రియులు దేశాంతరమరిగినంతనే స్త్రీలముఖములయందలి నవ్వులవలె కాంతిఁదక్కి ముడిగిపోవుచున్నవి.

అసితనయనలక్ష్మీం లక్షయిత్వోత్పలేషు,
క్వణితకనకకాఞ్చీం మత్తహంసస్వనేషు
అధరరుచిరశోభాం బంధుజీవే ప్రియాణాం
పథికజన ఇదానీం రోదితి భ్రాన్తచిత్తః.

టీ. ఇదానీం=ఇప్పుడు, పథికజనః = బాటసారిజనులు, ప్రియాణాం = ప్రియురాండ్రయొక్క, అసిత...లక్ష్మీం-అసిత = నల్లని, నయన = నేత్రముల యొక్క, లక్ష్మీం = శోభను, ఉత్పలేషు = కలువలయందును, క్వణిత... కాంచీం-క్వణిత = ధ్వనించు, కనకకాంచీం=బంగరు మొలనూలును, మత్త... స్వనేషు-మత్త = మదించిన, హంస = హంసలయొక్క. స్వనేషు = ధ్వనుల యందును, అధర...శోభాం - అధర = అధరోష్ఠముయొక్క, రుచిర = మనోహరమగు, శోభాం = శోభను, బంధుజీవే = మంకెనపూవునందును, లక్షయిత్వా = కనుగొని, భ్రాంతచిత్తః - భ్రాంత = భ్రమించిన, చిత్తః = మనసుగలవారై, రోదితి = ఏడ్చుచున్నారు.

తా. ఇప్పుడు బాటసారులు తాము ప్రయాణ మరిగినచోటులయందు గలువలఁ గనినంతనే తమప్రియురాండ్రకాటుకకండ్లశోభయు మదించిన హంసల ధ్వనులను వినినంతనే వారలబంగరందెలచప్పుడును, మంకెనపూవులఁ గనినంతనే తమప్రియలయధరోష్ఠంబులును దలంపునకు రాఁగ భ్రమించి కామోద్రేకంబును సైరింపఁ జాలక యేడ్చుచున్నారు.

అవ. సర్గాంతమున నొకశ్లోకముచే శరదంతమును వర్ణించుచున్నాఁడు.

స్త్రీణాం విహాయ వదనేషు శశాంకలక్ష్మీం
కామం చ హంసవచనం మణినూపురేషు
బంధూకకాన్తిమధరేషు మనోహరేషు
క్వాపి ప్రయాతి సుభగా శరదాగమశ్రీః. 25

టీ. సుభగా=మనోహరమగు, శరదాగమశ్రీః - శరత్ = శరదృతువు యొక్క, ఆగమ = ఆగమమునందలి, శ్రీః = శోభ, శశాంకలక్ష్మీం-శశాంక = చంద్రునియొక్క, లక్ష్మీం = శోభను, స్త్రీణాం = స్త్రీలయొక్క, వదనేషు = ముఖములయందును, కామం = సుందరమగు, హంసవచనం-హంస = హంసల యొక్క, వచనం = ధ్వనిని, మణినూపురేషు = రత్నపు టందెలయందును, బంధూకకాంతిం - బంధూక = మంకెనపూల, కాంతిం = కాంతిని, మనోహ

రేషు=మనోహరములగు, అధరేషు=అధరోష్ఠములయందును, విహాయ=విడిచి, క్వాపి-ఎచ్చటనో. ప్రయాతి=వెడలుచున్నది.

తా. ఇంతవరకు మనోహరమై యుండినశరల్లక్ష్మి తనశోభను విడిచి యరుగుచున్నది. ఇప్పుడు చంద్రుని శోభయంతయు స్త్రీలముఖములయందు నిలిచియున్నది. హంసధ్వనులు స్త్రీల యందెలయందు ప్రవేశించినవి. మంకెనఁ బూవులకాంతి స్త్రీలయధరంబులయందుఁ జొచ్చుచున్నది. అనఁగా ఇప్పుడు శరత్కాల మంతమగుచుండుటచే శరద్ధర్మములు తగ్గుచున్నవనియు అందు చంద్రుని నిర్మలమగుకాంతియు హంసలమనోహరరుతములును బంధూకాదుల యభివృద్ధమగుస్థితియుఁ గ్రమక్రమముగఁ దగ్గుచున్నదనియు తాత్పర్యము.

అవ. ఆశీర్వచనముతో సర్గమును ముగించుచున్నాఁడు.

వికచకమలవక్త్రా ఫుల్లనీలోత్పలాక్షీ
వికసితనవకాశశ్వేతవాసో వసానా,
కుముదరుచిరకాన్తిః కామినీ వోన్మదేయం
ప్రతిదిశతు శరద్వశ్చేతసః ప్రీతిమగ్ర్యామ్. 26

టీ. వికచ...వక్త్రా - వికచ = వికసించిన, కమల = కమలమనియెడు, వక్త్రా=ముఖముకలిగినదియును, ఫుల్ల...అక్షీ-ఫుల్ల=వికసించినదియు, నీలోత్పల= నల్లగలువ యనియెడు, అక్షీ = కనులుకలిగినదియును, వికసిత...వాసః-వికసిత = వికసించిన, నవ = నూతనమగు, కాశ = తెల్లు పూవనియెడు శ్వేత = తెల్లని, వాసః=వస్త్రమును, వసానా = ధరించినదియును, కుముద...కాంతిః-కుముద = కలువలచే, రుచిర = మనోహరమగు, కాంతిః=కాంతికలిగిన, ఇయం = ఈ, శరత్=శరదృతువు, వికచ...వక్త్రా-వికచ=వికసించిన, కమలమువంటి, వక్త్రా= ముఖముగలిగినదియును, ఫుల్ల...అక్షీ-ఫుల్ల = వికసించిన, నీలోత్పల = నల్లగలువలవంటి, అక్షీ=కనులు కలిగినదియును, వికసిత...వాసః - వికసిత = వికసించిన, నవ=నూతనమగు, కాశ=తెల్లుపూవువంటి, శ్వేతవాసః=తెలివలువను, వసానా= ధరించియుండునదియును, కుముద...కాంతిః - కుముద = కలువవలె, రుచిర =

మనోహరమగు, కాంతిః=కాంతిగల, ఉన్మదా=మదించిన, కామినీవ=కాముకు రాలువలె, వః=మీయొక్క, చేతసః = మనస్సునకు, అగ్ర్యాం = అధికమైన, ప్రీతిం=సంతోషమును, ప్రతిదిశతు=కలుగఁజేయుంగాక.

తా. వికసించినకమలము లనియెడు ముఖమును వికసించిన నల్లగలువ లనియెడు కన్నులుగలిగి వికసించియుండు తెల్లపూవు లనియెడు తెల్లని వస్త్రము ధరించి కలువలచే మనోహరమగుకాంతి గలిగి యొప్పెడు నీశరదృతువు వికసించిన కమలమువంటి ముఖమును నల్లగలువలవంటి కన్నులను గలిగి తెల్ల పూవువంటివస్త్రమును ధరించి కలువవంటి కాంతితో నొప్పు కామినియగు ప్రియురాలువలె మీకు సుఖసంతోషము లొసంగుగాక.

ఇది శ్రీమహాకవి కాళిదాసవిరచితమగు ఋతుసంహారకావ్యమున
శరదృతువర్ణనంబను తృతీయసర్గము.

---

# చతుర్థసర్గము.



అవ. శరదృతువును వర్ణించినయనంతరమున క్రమప్రాప్త మగు హేమంతమును వర్ణించుచున్నాఁడు.

శ్లో. నవప్రవాళోద్గమసస్యరమ్యః
ప్రఫుల్లలోధ్రః పరిపక్వశాలిః,
విలీనపద్మః ప్రపతత్తుషారో
హేమన్తకాలస్సముపాగతోఽయమ్. 1

టీ. నవ...రమ్యాః-నవ = నూతనములగు, ప్రవాళ = చిగుళ్లయొక్క, ఉద్గమ=పుట్టుకచేతను, సస్య = సస్యములచేతను, రమ్యః = రమ్యమైనదియు, ప్రఫుల్లలోధ్రః-ప్రఫుల్ల = వికసించిన, లోధ్రః = లొద్దుగచెట్టు కలిగినదియు, పరిపక్వశాలిః-పరిపక్వ=పండిన, శాలిః=వరికలిగినదియును, విలీనపద్మః-విలీన - అడఁగిన, పద్మః = పద్మములుకలిగినదియు, ప్రపతత్తుషారః - ప్రపతత్ = పడుచుండు, తుషారః = మంచుకలిగిన, అయం=ఈ, హేమంతకాలః=హేమంతకాలము, సముపాగతః=వచ్చెను.

తా. శరదృతువు గడచి చనిన యనంతరమున హేమంత ఋతువు వచ్చెను. ఇప్పుడు వృక్షములన్నియుఁ జిగురుపట్టుచున్నవి. వానిచేతను సస్యములచేతను జూచుటకంతయు రమ్యముగానున్నది. లొద్దుగలు పుష్పించినవి. వరిపైరంతయుఁ బండినది. పద్మములు తగ్గుచున్నవి. మంచు పడుచున్నది. ఈధర్మములతో హేమంతము వచ్చుచున్నది.

మనోహరైః కుంకుమరాగరక్తైః
తుషారకున్దేన్దునిభైశ్చ హారైః,
విలాసినీనాం స్తనశాలినీనాం
అలంక్రియన్తే స్తనమండలాని. 2

టీ. స్తనశాలినీనాం - స్తన=స్తనములచే, శాలినీనాం = ప్రకాశింపుచుండెడి, విలాసినీనాం = విలాసవతులయొక్క, స్తనమండలాని = స్తనమండలములు, మనోహరైః = మనోహరములైన, కుంకుమ...రక్తైః కుంకుమ = కుంకుమయొక్క, రాగ = ఎరుపుచే, రక్తైః = ఎఱ్ఱనైనవియు, తుషార = మంచుతోడను, కుంద = మల్లెతోడను, ఇందు = చంద్రునితోడను, నిభైః = సమానములగు, హారైః = హారములచే, అలంక్రియంతే = అలంకరింపఁబడుచున్నవి.

తా. ఇప్పుడు సుందరములగుకుచములు కలిగినబిబ్బోకవతులు దమస్తనములయందుఁ బూసికొనినకుంకుమ యంటుకొనుటచే నెఱ్ఱనై మనోహరములై మంచునీటిబిందువులవలెను మల్లెమొగ్గలవలెను చంద్రుఁడువలెను తెల్లనై యొప్పు హారములను దమస్తనములపైనుండి వైచుకొని యలంకరించుకొనుచున్నారు.

కాఞ్చీగుణైః కాంచనరత్నచిత్రైః
నో భూషయన్తి ప్రమదా నితమ్బమ్,
న నూపురైర్హంసరుతం భజద్భిః
పాదామ్బుజా న్యమ్బుజకాన్తిభాఞ్జి. 3

టీ. ప్రమదాః=అంగనలు, కాంచన...చిత్రైః - కాంచన=బంగారుచేతను, రత్న = రత్నములచేతను, చిత్రైః=చిత్రములైన, కాంచీగుణైః = మొలనూళ్లతో, నితంబం = నితంబప్రదేశమును, హంసరుతం = హంసధ్వనిని, భజద్భిః=పొందుచుండెడి, నూపురైః అందెలచే, అంబుజ...భాంజి - అంబుజ పద్మముయొక్క, కాంతి = కాంతిని, భాంజి = పొందెడి, పాదాంబుజాని = పాదపద్మములను, నోభూషయంతి = అలంకరింపుచుండలేదు.

తా. ఈ ఋతువునఁ జలి యధికమగుటచేఁ జల్లనిలోహాదుల సంపర్కమును సహింపఁజాలక సుందరులు నితంబబింబములపై బంగరుతోడను రత్నములతోడను నిర్మితములగు మొలనూళ్ళను గాళ్లయందందెలను ధరించుచుండలేదు.

న బాహుయుగ్మేషు విలాసినీనాం
ప్రయాన్తి సజ్గం వలయాఙ్గదాని,
నితమ్బబిమ్బేషు నవం దుకూలం
తన్వంశుకం పీనపయోధరేషు. 4

టీ. విలాసినీనాం = విలాసవతులయొక్క, బాహుయుగ్మేషు-బాహు = బాహువులయొక్క, యుగ్మేషు = జంటలయందు, వలయాంగదాని-వలయ = కంకణములును, అంగదాని = దండకడియములును, సంగం = సంబంధమును, న ప్రయాంతి=పొందుచుండలేదు, నితంబబింబేషు = నితంబమండలములయందు, నవం=నూతనమగు, దుకూలం = పట్టువస్త్రమును, పీనపయోధరేషు-పీన=బలిసిన, పయోధరేషు=స్తనములయందు, తన్వంశుకం = సన్నవలువలును. సంగం=సంబంధమును. న ప్రయాంతి = పొందుచుండలేదు.

తా. ఈ ఋతువున విలాసవతులు దమచేతులకుఁ జల్లనికడియములు మొదలగు నాభరణములను ధరించుటకు నితంబమునను స్తనములయందును సన్నని పట్టువలువలను ధరించుటకును సహింపకున్నారు.

గాత్రాణి కాలీయకచర్చితాని
సపత్రలేఖాని ముఖామ్బుజాని,
శిరాంసి కాలాగురుధూపితాని
కుర్వన్తి నార్యః సురతోత్సవాయ. 5

టీ. నార్యః = స్త్రీలు, సురతోత్సవాయ = సురతోత్సవముకొఱకు, గాత్రాణి=దేహములను, కాలీయకచర్చితాని-కాలీయక=మ్రానిపసుపుచే, చర్చితాని=పూయఁబడినవిగను, ముఖాంబుజాని=ముఖపద్మములను, సపత్రలేఖాని =

మకరికాపత్రములతోఁ గూడినవిగను, శిరాంసి = శిరస్సులను, కాలాగురుధూపి తాని - కాలాగురు = నల్లఅగురుచే, ధూపితాని = ధూపము వేయఁబడినవిగను, కుర్వంతి = చేయుచున్నారు.

తా. స్త్రీలు ఉష్ణముగను సువాసన గలదిగనునుండి సురతమున నుత్సాహము గలుగుటకై తమ శరీరములయందు ప్రానిపసుపును బూసికొనుచున్నారు. ముఖములయందుఁ గస్తూరిచే మకరికాపత్రముల దిద్దికొనుచున్నారు. తల వెండ్రుకకు నల్లఅగరును బొగ వేసికొనుచున్నారు.

రతిశ్రమక్షామవిపాణ్డువక్త్రాః
సంప్రాప్తహర్షాభ్యుదయా స్తరుణ్యః,
హసన్తి నోచ్చైర్దశనాగ్రభిన్నాన్
ప్రపీడ్యమానానధరానవేక్ష్య. 6

టీ. రతి...వక్త్రాః-రతి = సంభోగమునందలి, శ్రమ=శ్రమచే, క్షామ = వాడిన, విపాండు= తెల్లనైన, వక్త్రాః=ముఖముకలిగినట్టివియు, సంప్రాప్త ..అభ్యుదయాః-సంప్రాప్త=పొందఁబడిన, హర్ష=సంతోషముయొక్క, అభ్యుదయాః= అభివృద్ధికలిగిన, తరుణ్యః = తరుణులు, దశన...భిన్నాన్-దశన=దంతముల యొక్క, అగ్ర=చివరలచే, భిన్నాన్ = భేదించఁబడిన, ప్రపీడ్యమానాన్ = బాధింపుచుండెడి, అధరాన్=అధరోష్ఠములను, అవేక్ష్య = చూచి, ఉచ్చైః= అధికముగ, నహసంతి = నవ్వుటలేదు.

తా. రత్యాయాసముచే వాడి తెల్లనై యుండుముఖములతో నొప్పుచు రత్యానందనిర్భరలై యుండు తరుణాంగనలు ఆనందాతిరేకముచే నధికముగ నవ్వుట కవసరము ప్రాప్తమై యున్నను తమప్రియులదంతపుకాట్లచే వ్రణము కలిగి యుండు పెదవులు నవ్వునపుడు వికసించి బాధించు ననుభయమున నెక్కువగ నవ్వుచుండలేదు.

పీనస్తనోరఃస్థలభాగశోభా
మాసాద్య తత్పీడనజాతఖేదః,

తృణాగ్రలగ్నైస్తుహినైః పతద్భి
రాక్రన్దతీవోషసి శీతకాలః.

టీ. పీన...శోభాం-పీన=బలిసిన, స్తన=స్తనములుగల, ఉరఃస్థల = వక్షః ప్రదేశముయొక్క, భాగ=భాగమునందలి, శోభాం=శోభను, ఆసాద్య=పొంది తత్...ఖేద-తత్=దానియొక్క, పీడన = పీడించుటచే, జాత=కలిగిన, ఖేదః= దుఃఖముకలదై, శీతకాలః=శీతకాలము, ప్రభాతే=ప్రాతఃకాలమున, పతద్భిః= పడుచున్నటువంటి, తృణ...లగ్నైః-తృణ = గడ్డియొక్క, అగ్ర=చివరలయందు లగ్నైః = తగుల్కొనిన, తుహినైః = మంచుబిందువులచే, ఆక్రందతీవ = ఏడ్చుచున్నదివలె నున్నది.

తా. ఈ ఋతువునఁ బ్రాతఃకాలమున మంచుబిందువులు పడి యవి గడ్డి కొనలయందుఁ దగుల్కొని యుండును. ఆ బిందువులఁ జూచిన పీనస్తనశోభి తము లగు సుందరీమణుల వక్షోభాగంబుల నంటిన యీ శీతకాల మచ్చటి నలుగుడుఁ జెంది యా ఖేదముచే నేడ్చుచున్నదా ? యనునట్లున్నది.

ప్రభూతశాలిప్రసవైశ్చితాని
మృగాఙ్గనాయూథవిభూషితాని,
మనోహరక్రౌఞ్చనినాదితాని
సీమాన్తరాణ్యుత్సుకయన్తి చేతః.　　8

టీ. ప్రభూత...ప్రసవైః-ప్రభూత=అధికములైన, శాలి=వరియొక్క, ప్రసవైః=పంటలచే, చితాని = వ్యాప్తములైనవియు, మృగ...విభూషితాని- మృగాంగనా=ఆఁడులేళ్ళయొక్క, యూథ=గుంపులచే, విభూషితాని=అలంక రింపఁబడినవియు, మనోహర...నినాదితాని - మనోహర = మనోహరములగు, క్రౌంచ=జక్కవపక్షులచే, నినాదితాని = ధ్వనింపఁజేయబడిన, సీమాన్తరాణి= పొలిమేరల నడిమిప్రదేశములు, చేతః = మనస్సును, ఉత్సుకయంతి = వేడుక కలుగఁ జేయుచున్నవి.

తా. ఇప్పుడు పొలిమేరలనడుమనుండు ప్రదేశములు అధికముగ వరి పంటలచే వ్యాప్తములై యున్నవి. లేడులేళ్ళు గుంపులుగుంపులై యందు సంచరింపుచున్నవి. జక్కువ లచ్చట మనోహరముగఁ గూయుచున్నవి. ఇట్టి సన్నివేశమంతయుం చూడ నింపుగొల్పుచున్నది.

ప్రఫుల్లనీలోత్పలశోభితాని,
సోన్మాదకాదమ్బవిభూషితాని.
ప్రసన్నతోయాని సుశీతలాని
సరాంసి చేతాంసి హరన్తి పుంసామ్. 9

టీ. ప్రఫుల్ల...శోభితాని-ప్రఫుల్ల = వికసించిన, నీలోత్పల=నల్లగలువలచే,శోభితాని=శోభింపఁజేయఁబడినవియు, సోన్మాద...విభూషితాని-సోన్మాద=మదముతోఁగూడిన, కాదంబ = కలహంసలచే, విభూషితాని = అలంకరింపఁజేయఁబడినవియుం, ప్రసన్నతోయాని-ప్రసన్న = తేరిన, తోయాని=జలములు కలిగినవియుం, సుశీతలాని = మిగులచల్లనైన, సరాంసి=సరస్సులు, పుంసాం=పురుషులయొక్క, చేతాంసి = మనస్సులను, హరంతి = హరించుచున్నవి.

తా. ఇప్పుడు సరస్సులయందు నల్లగలువ లన్నియుం వికసించి యున్నవి. మదించి కలహంసలు గూయుచున్నవి. జలములు తేరి చల్లనై యున్నవి. ఇట్టి సరస్సులు చూడ నెంతయుం మనోహరములై యున్నవి.

పాకం వ్రజన్తి హిమజాతశీతై
రాధూయమానా సతతం మరుద్భిః,
ప్రియే ప్రియంగుః ప్రియవిప్రయుక్తా
విపాండుతాం యాతి విలాసినీవ. 10

టీ. హే ప్రియే=ఓ ప్రియురాలా! హిమ...శీతైః-హిమ=మంచుచేత, జాత=పుట్టిన, శీతైః=చలిచేత, పాకం=పండుటను, వ్రజంతీ = పొందుచుండెడి, మరుద్భిః=వాయువులచే, సతతం=ఎల్లప్పుడును, అధూయమానా=కదల్పఁబడు

చుండు, ప్రియంగుః=ప్రేంకణపుచెట్టు, ప్రియవిప్రయుక్తా-ప్రియ = ప్రియుని తో, విప్రయుక్తా=వియోగమును పొందిన, విలాసినీవ=విలాసవతివలె, విపాండుతాం=తెల్లనగుటను, యాతి=పొందుచున్నది.

తా. మంచుచేఁ గలిగినచలికిఁ బండిపోయి గాలికిఁ గదలుచుసుండు ప్రేంకణపుచెట్టు ప్రియునితో వియోగమును బొంది మనస్సు చలించియుండు సుందరివలె తెల్లఁబారి పోవుచున్నది.

పుష్పాసవామోదసుగన్ధివక్త్రో
నిఃశ్వాసవాతైః సురభీకృతాఙ్గః,
పరస్పరాఙ్గవ్యతిరిక్తశాయీ
శేతే జనః కామరసానువిద్ధః. 11

టీ. పుష్ప...వక్త్రః-పుష్ప=పూవుల యొక్క, ఆసవ=మద్యముయొక్క, ఆమోద=పరిమళముచే, సుగంధి=పరిమళింపుచుండు, వక్త్రః = ముఖముకలిగినదియు, నిఃశ్వాసవాతైః=నిట్టూర్పువాయువులచే, సురభీకృతాంగః=సురభీకృత= పరిమళముకలదిగఁ జేయఁబడిన, అంగః=అవయవములు కలిగిన, జనః = జనము, కామరసానువిద్ధః-కామ=కామముయొక్క, రస=రసముచే, అనువిద్ధః=కూర్పఁ బడినదై, పరస్పర...శాయీ-పరస్పర = పరస్పరముయొక్క, అంగ=అవయవములతో, వ్యతిరిక్త=కలియునట్లు, శాయీ=శయనింపుచున్నదై, శేతే=నిద్రింపుచున్నది.

తా. పూవులచే సిద్ధముచేయఁబడిన మద్యము త్రానుటచే పరిమళింపుచుండుముఖములు గలిగి అట్టిపరిమళసంబంధము గలనిట్టూర్పులు దగులుటచేఁ బరస్పరము అవయవములు పరిమళింపుచుండఁ గామరసముచే వ్యాపింపఁబడినవారలై జనులొకరికొకరు తగులునట్లు శయనించి నిద్రింపుచున్నారు.

దన్తచ్ఛదైః సవ్రణదన్తచిహ్నైః
స్తనైశ్చ పాణ్యగ్రకృతాభిలేఖైః

సంసూచ్యతే నిర్దయమఙ్గనానాం
రతోపభోగో నవయౌవనానామ్. 12

టీ. సవ్రణ...చిహ్నైః-సవ్రణ=గాయముతోఁగూడిన, దంత=దంతములయొక్క, చిహ్నైః = గుర్తులుకలిగిన, దంతచ్ఛదైః పెదవులచేతను, పాణి... అభిలేఖైః-పాణ్యగ్ర=గోళ్ళచే, కృత=చేయఁబడిన, అభిలేఖైః = గీరు కలిగిన, స్తనైశ్చ=స్తనములచేతను, నవయౌవనానాం = క్రొత్తయౌవనముగల అంగనానాం=స్త్రీలయొక్క నిర్దయం=దయలేనట్టుగ, రతోపభోగః-రత = స్మరతనుయొక్క, ఉపభోగః=అనుభవము, సంసూచ్యతే=సూచింపఁబడుచున్నది.

తా. క్రొత్తవయసున నుండుసుందరాంగనలప్రియులచేఁ జేయఁబడిన పలుకాట్లతోఁగూడి యుండు పెదవులను గోళ్ళగీరులు కలస్తనములను కనినంతనే వీరలు కఠిన మగుసురతము ననుభవించి రని సూచిత మగుచున్నది. ఈఋతువునఁ గామోపభోగములకెక్కువయుత్సాహమును అనుకూల్యమునుగలుగును. కావున యౌవను లగుకామినీ కాముకులు గాఢముగ సుఖములం దేలుచున్నారు.

కాచిద్విభూషయతి దర్పణసక్తహస్తా
బాలాతపేషు వనితా వదనారవిన్దమ్,
దన్తచ్ఛదం ప్రియతమేన నిపీతసారం
దన్తాగ్రభిన్నమవకృష్య నిరీక్షతే చ. 13

టీ. కాచిత్=ఒకానొక, వనితా = స్త్రీ దర్పణ...హస్తా-దర్పణ = అద్దమునందు, సక్త=తగుల్కొనిన, హస్తా-హస్తముకలదై, బాలాతపేషు = లేయెండలయందు, వదనారవిందం=ముఖపద్మమును, విభూషయతి = అలంకరింపుచున్నది, ప్రియతమేన=ప్రియునిచే, నిపీతసారం-నిపీత=త్రాగఁబడిన, సారం = సారముగల, దంత...భిన్నం-దంత = దంతములయొక్క, అగ్ర = చివరలచే, భిన్నం=భేదించఁబడిన, దంతచ్ఛదం = పెదవిని, అవకృష్య=లాగి, నిరీక్షతే చ= చూచుచునున్నది.

తా. ఒకసుందరాంగన లేయెండయందు నిలిచి చలికాగుచు అద్దముఁ జూచుకొనుచుఁ బద్మమువంటి ముఖము నలంకరించుకొనుచున్నది. మఱియొం రాత్రినిఁ బ్రియుడు గాఢముగ నానుటచే గాయములు పడియుండు పెదవిని లాగి చూచుకొనుచున్నది.

అన్యా ప్రకామసురతశ్రమఖిన్నదేహా
రాత్రిప్రజాగరవిపాటలనేత్రపద్మా,
స్రస్తాంసదేశలులితాకులకేశపాశా
నిద్రాం ప్రయాతి మృదుసూర్యకరాభితప్తా. 14

టీ. అన్యా=మఱియొక స్త్రీ, ప్రకామ...దేహా-ప్రకామ=అధికమగు, సురత=రతియందలి, శ్రమ=ఆయాసముచే, ఖిన్న = అలసిన, దేహా=దేహము కలదై, రాత్రి...పద్మా=రాత్రి=రాత్రియందలి, ప్రజాగర=మేలుకొనుటచే, విపాటల=తెల్లనగు, నేత్రపద్మా=పద్మములవంటి నేత్రములుకలదై, స్రస్త... పాశా-స్రస్త=జారిన, అంసదేశ=భుజభాగమున, లులిత=పొరలుచుండు, ఆకుల =వ్యాకులమైన, కేశపాశా=కేశసమూహముకలదై, మృదు...తప్తా-మృదు= మృదువగు, సూర్యకర=సూర్యకిరణములచే, అభితప్తా=కాచఁబడినదై, నిద్రాం = నిద్రను, ప్రయాతి=పొందుచున్నది.

తా. మరియొకసుందరీమణి అధిక మగుసురతాయాసముచే నలసినదై రాత్రి మేలుకొని యుండుటచేఁ దెల్లనగుకను లొప్పుచుండ ముడి వీడి భుజములపై వ్యాపించి పొరలుచు వెండ్రుక లలరార లేయెండ మీద వ్యాపించి చలిసణచుచుండ నిద్రించుచున్నది.

నిర్మాల్యదామపరిముక్తమనోజ్ఞగన్ధం
మూర్ధ్నో౽పనీయ ఘననీలశిరోరుహాన్తాః,
పీనోన్నతస్తనభరానతగాత్రయష్ట్యః
కుర్వన్తి కేశరచనామపరాస్తరుణ్యః. 15

టీ. ఘన...అంతాః-ఘన=మేఘమువలె నీల=నల్లని, శిరోరుహా = వెంట్రుకలయొక్క, అంతాః=చివరలు కలిగినట్టియు, పీన...యష్ట్యః-పీన=బలిసిన ఉన్నత=ఎత్తైన, స్తన=స్తనములయొక్క, భర=బరువుచే, ఆనత=వంగిన, గాత్ర యష్ట్యః = యష్టివంటిదేహముకలిగిన, అపరాః = మఱికొందఱు, తరుణ్యః = తరుణులు, పరిముక్త ..గంధం పరిముక్త = విడువఁబడిన, మనోజ్ఞ=మనోహరమగు, గంధం=సువాసనకలిగిన, నిర్మాల్యదామ=నిర్మాల్యమాలికను, మూర్ధ్నః = తలనుండి, అపనీయ=తొలఁగించి, కేశరచనాం-కేశ = వెంట్రుకలయొక్క, రచనాం=నిర్మాణమును, కుర్వంతి=చేయుచున్నారు.

తా. మేఘమువలె నల్లనైయుండుకురులు గలిగి పీనోన్నతకుచముల చే సుందర మగుదేహము కొంచెము వంగి యుండు మఱికొందరు సుందరీమణులు వెనుకటిదినమున ధరించిన దగుటచే పరిమళము నశించి యుండుపూలమాలికలను తలలనుండి తీసివైచి తలలు దువ్వి జడ మొదలగువాని నల్లుకొనుచున్నారు.

అన్యా ప్రియేణ పరిభుక్తమవేక్ష్య గాత్రం
హర్షాన్వితా విరచితాధరచారుశోభా,
కూర్పాసకం పరిదధాతి నఖక్షతాఙ్గీ
వ్యాలమ్బినీలలలితాలకకుఞ్చితాక్షీ. 16

టీ. ప్రియేణ=ప్రియునిచే, పరిభుక్తం = అనుభవింపఁబడిన, గాత్రం = శరీరమును; అపేక్ష్య=చూచి, హర్షాన్వితా-హర్ష=ఆనందముతో, అన్వితా = కూడినదియు, విరచిత...శోభా-విరచిత=రచింపఁబడిన, అధర =అధరోష్ఠముయొక్క, చారు = మనోహరమగు, శోభా = శోభకలిగినదియు, నఖ...అంగీ-నఖ = గోళ్ళచేఁ జేయఁబడిన, క్షత=గాయములుకలిగిన, అంగీ=అవయవములు గలదియు, వ్యాలంబి...అక్షీ-వ్యాలంబి=వ్రేలుచుండు, నీల=నల్లని, లలిత=మనోహరమగు, అలక=ముంగురులచే, కుంచిత=మూయఁబడిన, అక్షీ=కనులుకలిగిన, అన్యా=మఱియొకర్తుక, కూర్పాసకం=రవికను, పరిదధాతి=తొడుగుచున్నది.

తా. మఱియొకభామిని తనదేహమునందలి ప్రియోపభోగచిహ్నముల ను జూచుకొని సంతోషించినదై అందుచే తనయధరము నొకవిధమగుశోభ గలుగునట్లు విరచింపుచు నఖక్షతములు గలిగిన దేహముతో నల్లనిమనోహరము లగు ముంగురులు వీడి కనులపైఁ బడుచుండుటచేఁ గనులమూయుచు రవికను దొడుగుచున్నది.

అన్యాశ్చిరం సురతకేళిపరిశ్రమేణ
ఖేదం గతాః ప్రశిథిలీకృతగాత్రయష్ట్యః,
సంహృష్యమాణపులకోరుపయోధరాన్తాః
అభ్యఞ్జనం విదధతి ప్రమదాః సుశోభాః. 17

టీ. చిరం=చాలసేపు, సురత...పరిశ్రమేణ - సురతకేళి=రతిక్రీడచే నైన, పరిశ్రమేణ= ఆయాసముచే, ఖేదం = దుఃఖమును, గతాః=పొందినట్టి యు, ప్రశిథిలీకృతగాత్రయష్ట్యః - ప్రశిథిలీకృత = మిగులశిథిలముగాఁ జేయఁబడిన, గాత్రయష్ట్యః=యష్టివంటిదేహముకలిగినట్టియు,సంహృష్యమాణ ...అంతాః-సంహృష్యమాణ = వికసించుచుండు, పులక = గగుర్పాటుకలిగిన, ఊరు=గొప్ప,పయోధర=స్తనములయొక్క, అంతాః=సమీపములుకలిగినట్టియు, సుశోభాః=మంచిశోభ కలిగిన,అన్యాః = మఱికొందఱు, ప్రమదాః=స్త్రీలు, అభ్యంజనం = అభ్యంగమును, విదధతి=చేయుచున్నారు.

తా. చాలసేపు రతియందుండుటచే శ్రమఁజెంది యలసినట్టియు రతి శ్రమచే సడలిపోయినదేహము గలిగినట్టియు మంచిశోభగలిగిన మఱికొందఱు సుందరాంగనలు స్తనపార్శ్వప్రదేశములు పులకరింపుచుండ రతిశ్రమమడంగుటకై యభ్యంగము నాచరింపుచున్నారు.

బహుగుణరమణీయో యోషితాం చిత్తహారీ
పరిణతబహుశాలివ్యాకులగ్రామసీమా.
సతతమతిమనోజ్ఞః క్రౌంచమాలాపరీతః
ప్రదిశతు హిమయుక్తః కాల ఏషః సుఖం వః. 18

టీ. బహు...రమణీయః-బహు = అనేకములగు,గుణ=గుణములచే రమణీయః = రమణీయమగు నదియు, యోషితాం = స్త్రీలయొక్క, చిత్తహారీ= మనసును హరించునదియు, పరిణత...సీమా-పరిణత=పండిన బహు = అధికమైన, శాలి=వరిచే, వ్యాకుల = వ్యాకులమైన, గ్రామ = గ్రామముయొక్క, సీమా = ప్రదేశములు కలిగినదియు, సతతం=ఎల్లప్పుడు, అతిమనోజ్ఞః=మిగుల మనోహరమగు నదియు, క్రౌంచ=జక్కవ పక్షుల, మాలా=పంక్తులచే, పరీతః =చుట్టఁబడినదియు, హిమయుక్తః - హిమ = మంచుతో, యుక్తః = కూడియుండు, ఏషః=ఈ, కాలః కాలము, వః=మీకు; సుఖం = సుఖమును, ప్రదిశతు = కలుగఁజేయుఁగాక.

తా. వెనుకటి వర్ణనమున చెప్పఁబడినయనేకగుణములచే రమణీయమైయుండునదియు స్త్రీలకుఁ గామోద్రేకమును జేయునదియగుటచే వారిమనసులకానందము నొసఁగునదియు వరియంతయు పండియుండుటచే వరిచేఁ జుట్టంబడియుండుపొలములు కలిగియుండునదియు రాత్రియు పగలును ఎల్లసమయములయందును అతిశీతముగాని అత్యుష్ణముగాని కలుగకుండుటచే మిగుల మనోహరమైనదియు జక్కవపక్షులు పంక్తిం దీరి యుండునదియు మంచుకలిగియుండునదియు నగు నీహేమంత కాలము మీకు సుఖము నొసంగుఁ గాక.

ఇది శ్రీమహాకవి కాళిదాసవిరచితమగు ఋతుసంహారకావ్యమున
హేమంతఋతువర్ణనంబను చతుర్థసర్గము.

---

# పంచమసర్గము



అవ. హేమంతర్తువు నభివర్ణించినయనంతరమునఁ క్రమప్రాప్తమగు శిశిరర్తువును వర్ణించుచున్నాఁడు.—

ప్రరూఢశాల్యంశుచయైర్మనోహరం
క్వచిత్ స్థితక్రౌఞ్చనినాదరాజితమ్,
ప్రకామకామం ప్రమదాజనప్రియం
వరోరు కాలం శిశిరాహ్వయం శృణు. 1

టీ. వరోరు - వర = మంచి, ఊరు=తొడలుకలిగిన నో ప్రియురాలా! ప్రరూఢ...చయైః - ప్రరూఢ=పెరిగిన, శాల్యంశు - వరివెన్నులయొక్క, చయైః=సమూహములచే, మనోహరం = మనోహరమైనదియు,క్వచిత్ ...రాజితం-క్వచిత్=ఒక్కొకచోట, స్థిత=ఉండెడి, క్రౌంచ=జక్కవపక్షులయొక్క, నినాద=ధ్వనిచే, రాజితం = అలంకరింపఁబడినదియు, ప్రకామకామం-ప్రకామ=అధికమైన, కామం = కామముకలిగినదియు, ప్రమదాజనప్రియం - ప్రమదాజన=స్త్రీజనులకు, ప్రియం=ఇష్టమైన, శిశిరాహ్వయం-శిశిర = శిశిరమనెడి, ఆహ్వయం=పేరుకలిగిన, కాలం=కాలమును శృణు=వినుము.

తా. ఓప్రియురాలా! మనోహరములై పెరిగి యుండువరివెన్నులు గలిగి హేమంతమునందువలె ఎచ్చటఁ జూచినను గాక అచ్చటచ్చటఁ గూయుచుండు జక్కవలు గలిగి కామమును వృద్ధిపొందించునదై కావుననే స్త్రీజనులకు మిగులనిష్టమైయుండు శిశిరర్తువును గురించి చెప్పెద వినుము.

నిరుద్ధవాతాయనమందిరోదరం
హుతాశనో భానుమతో గభస్తయః,
గురూణి వాసాంస్యబలాః సయౌవనాః
ప్రయాన్తి కాలేఽత్ర జనస్య సేవ్యతామ్. 2

టీ. నిరుద్ధ...ఉదరం-నిరుద్ధ=మూయఁబడిన, వాతాయన=గవాక్షము లు కలిగిన, మన్దిర=గృహములయొక్క, ఉదరం = మధ్యభాగములును, హుతాశనః=అగ్నియు, భానుమతః=సూర్యునియొక్క, గభస్తయః = కిరణములును, గురూణి=దట్టములగు, వాసాంసి=వస్త్రములును, సయౌవనాః = యౌవనము తోఁగూడిన, అబలాః=స్త్రీలును, అత్ర=ఈ, కాలే=కాలమునందు, జనస్య= జనమునకు, సేవ్యతాం=అనుభవింపఁదగినవగుటకు, ప్రయాంతి=పొందుచున్నవి.

తా. ఈఋతువునఁ జలి యధిక మగుటచే జను లందఱకును గవాక్షములు మూసి యుంచఁబడిన గృహమధ్యభాగములును అగ్నియు యౌవనాంగనలును సూర్యకిరణములును దృఢము లగువస్త్రములును జనులయుపయోగమునకు మిగుల నర్హములై యున్నవి.

న చన్దనం చన్ద్రమరీచిశీతలం
న హర్మ్యపృష్ఠం శరదిన్దునిర్మలమ్,
న వాయవః సాన్ద్రతుషారశీతలాః
జనస్య చిత్తం రమయన్తి సామ్ప్రతమ్. 3

టీ. సాంప్రతం = ఇప్పుడు, చంద్ర...శీతలం - చంద్ర = చంద్రుని యొక్క,మరీచి=కిరణములవలె,శీతలం=చల్లని, చందనం=గంధమునకు, శరద్... నిర్మలం శరత్=శరత్కాలమునందలి, ఇందు=చంద్రునివలె, నిర్మలం=స్వచ్ఛ మైన, హర్మ్యపృష్ఠం-హర్మ్య=మేడలయొక్క, పృష్ఠం=పైభాగమును, సాంద్ర ...శీతలాః-సాంద్ర=దట్టమగు, తుషార=మంచుచే, శీతలాః=చల్లనగు, వాయ వః=వాయువులును, జనస్య=జనముయొక్క, చిత్తం మనసును, నరమయంతి= సంతోషపెట్టుచుండలేదు.

తా. ఈశిశిరఋతువునందు జనులు చంద్రకిరణములవలె చల్లగ నుండుగంధములను నలఁదుకొనుచుండలేదు. శరత్కాలచంద్రునివలె స్వచ్ఛములై యుండు మేడలపై యంతస్తులయందు విహారింపుచుండలేదు. దట్టముగఁ గురియుచుండు మంచుయొక్క సంబంధమువలన చలిఁ గలిగించు వాయువుల సేవింపుచుండలేదు.

తుషారసంఘాతనిపాతశీతలాః
శశాఙ్కభాభిః శిశిరీకృతాః పునః,
విపాణ్డుతారాగణజిహ్మభూషితాః
జనస్య సేవ్యా న భవన్తి రాత్రయః. 4

టీ. తుషార...శీతలాః-తుషార = మంచుయొక్క, సంఘాత = సమూహముయొక్క, నిపాత=పడుటచే, శీతలాః = చల్లనైనవియు, శశాంకభాభిః-శశాంక=చంద్రునియొక్క, భాభిః=కిరణములచే, పునః=ఇంకను, శిశిరీకృతాః=చల్లగఁ జేయఁబడినవియు, విపాండు...భూషితాః-విపాండు = మిగుల తెల్లగనుండు, తారా = నక్షత్రములయొక్క, గణ==సమూహముచే, జిహ్మ=కుటిలముగ, భూషితాం=అలంకరింపఁబడిన, రాత్రయః = రాత్రులు, జనస్య=జనమునకు, సేవ్యాః=సేవింపఁదగినవిగ, న భవంతి = అగుచుండలేదు.

తా. మంచుదట్టముగఁ గురియుచుండుటచేఁ జలిని గలిగించునవై చంద్రకిరణప్రసారముచే మిగులఁచలిని గలిగించుచు మేఘములేమియు లేనందుటచే మిగులఁ దెల్లనై ప్రకాశించు నక్షత్రకాంతులు గలిగియుండు నీశిశిరకాలపురాత్రులు జనుల కింపు గలిగించునవిగ లేవు.

గృహీతతామ్బూలవిలేపనస్రజః
సుఖాసవామోదితవక్త్రపఙ్కజాః,
ప్రకామకాలాగురుధూపవాసితం
విశన్తి శయ్యాగృహముత్సుకాః స్త్రియః. 5

టీ. గృహీత... స్రజః-గృహీత = గ్రహింపఁబడిన, తాంబూల=తాంబూలమును విలేపన = పూఁతవస్తువులును, స్రజః = మాలికలును కలిగినట్టియును, సుఖ...పంకజాః-సుఖ=సుఖకరములగు. ఆసవ = మద్యములచే, ఆమోదిత = పరిమళము కలదిగఁ జేయఁబడిన, వక్త్రపంకజాః = ముఖకమలములు కలిగిన, స్త్రియః=స్త్రీలు, ప్రకామ...వాసితం-ప్రకామ = అధికముగ, కాలాగురు = నల్లఅగరుయొక్క, ధూప = పొగఁబట్టుటచే, వాసితం = వాసనకలుగఁజేయఁబడిన, శయ్యాగృహం=పడకటింటిని, ఉత్సుకాః=వేడుకకలవారలై, విశంతి = ప్రవేశింపుచున్నారు.

తా. స్త్రీలు తాంబూలమును గస్తూరి మొదలగు మైపూఁతవస్తువులను బూలమాలికలను జలిచే నుపయోగింపక చేతమాత్రము పట్టుకొని ఈకాలమునకు సుఖమును గలిగించుమద్యముల నుపయోగించుటచే సుందరము లగుముఖములు పరిమళించుచుండ నధికముగ నల్లనియగరుధూపము బట్టుటచేఁ బరిమళించుచుండు పడకటిండ్ల నుత్సాహముతోఁ బ్రవేశించుచున్నారు.

కృతాపరాధాన్బహుశో౽పి తర్జితాన్
సవేపథూన్సాధ్వసలుప్తచేతసః,
నిరీక్ష్య భర్తౄన్ సురతాభిలాషిణః
స్త్రియో౽పరాధాన్సమదా విసస్మరుః. 6

టీ. కృతాపరాధాన్-కృత=చేయఁబడిన అపరాధాన్ = అపరాధము కలిగినట్టియుం, బహుశః=పలుమాఱు, తర్జితానపి = తర్జనచేయఁబడినట్టియుం, సవేపథూన్=వణఁకుతోఁ గూడినట్టియుం, సాధ్వసలుప్తచేతసః - సాధ్వస = భయముచే, లుప్త=నశించిన, చేతసః = మనసుకలిగిన. భర్తౄన్ = భర్తలను, సురతాభిలాషిణః-సురత = సురతమును, అభిలాషిణః = కోరుచుండు వారలనుగా, నిరీక్ష్య = తెలుసుకొని, సమదాః - కామమదముతోఁగూడియుండు, స్త్రియః = స్త్రీలు, అపరాధాన్=తప్పులను, విసస్మరుః=మఱచిరి.

తా. మదవతు లగుస్త్రీలు తమప్రియుం లపరాధములఁ జేయఁగోపించి వారల ననేకముగఁ దర్జనముసేసియుం వారలు భయముచే మనసుచెడి వణఁకుచు

తమప్రియంరాత్రసంగమమును గోరుచు నుండుటను గాంచి కామోద్రేకముచే వారియపరాధముల మఱచి శోకకలం దీర్చుచున్నారు. ఈఋతువున యువతులు దమప్రియుల యపరాధముల నన్నింటిని మఱపింపఁజేయఁజాలిన కామోద్రేకమును కలిగియుండు రనుట.

ప్రకామకామైర్యువభిః సనిర్దయం
నిశాసు దీర్ఘా స్వభిరామితాశ్చిరమ్,
భ్రమన్తి మన్దం శ్రమఖేదితోరసః
క్షపావసానే నవయౌవనాః స్త్రియః.　　7

టీ. ప్రకామకామైః-ప్రకామ = అధికమైన, కామైః=కామము కలిగిన, యువభిః = యౌవనులచేత, సనిర్దయ = నిర్దయతోఁగూడునట్లుగ, దీర్ఘాసు =పొడవులగు, నిశాసు=రాత్రులయందు, చిరం=చాలసేపు, అభిరామితాః=రమింపఁజేయఁబడినట్టియు, శ్రమ...రసః-శ్రమ = ఆయాసముచే, ఖేదిత = అలపింపఁబడిన, ఉరసః=వక్షములుకలిగినట్టియు, నవయౌవనాః-నవ = నూతనమగు, యౌవనాః=యౌవనముకలిగిన, స్త్రియః=స్త్రీలు, క్షపావసానే-క్షపా=రాత్రియొక్క, అవసానే = అంతమునందు, మన్దం=మెల్లగా, భ్రమంతి = తిరుగుచున్నారు.

తా. అధికమగుకామము గలయౌవనవంతులగుప్రియులు దీర్ఘములగు శీశిరరాత్రులయందుఁ గాఢాధిక్యముచే నవయౌవనవతు లగుతమప్రియురాండ్రతో గాఢముగ రతు దేల వారలు మిగుల నలసి తెల్లవారినవెనుక మెల్లగానే అంత సంచరించుచు న్నారు.

మనోజ్ఞకూర్పాస డిత స్తనాః
సరాగకౌశేయకభ ితోరసః,
నివేశితా న్తఃకుసు శిరోరుహైః
విభూషయ న్తీవ హి గాగమం స్త్రియః.　　8

టీ. మనోజ్ఞ...స్తనాః నోజ్ఞ=మనోహరమగు, కూర్పాసక=రవికచే, పీడిత=బిగింపఁబడిన, స్తనాః = నములుకలిగినట్టియుం, సరాగ...రసః-

సరాగ = రంగుతోఁగూడిన, కౌశేయక = పట్టుచీరచే, భూషిత = అలంకరింపఁబడిన, ఉరసః=వక్షములుకలిగినట్టియు, వివేశిత...కుసుమైః-వివేశిత = ప్రవేశ పెట్టఁబడిన, అన్తః = లోభాగములుకలిగిన, కుసుమైః = పూవులుగల, శిరోరుహైః=వెండ్రుకలతో, ఉపలక్షితాః = కూడుకొనిన, స్త్రియః=స్త్రీలు, హిమాగమం = శీతకాలమును, విభూషయన్తిస=అలంకరించుచున్నట్లున్నారు.

తా. స్తనములు బిగియున్నట్లు మనోహరము లగుఱవికలఁ దొడగి రంగువేయఁబడినపట్టుచీరలపవిటెలు వక్షములపై నొప్పుచుండ శిండ్రుకలయందుఁ బూలముడిచి చూడ మనోహరములై యొప్పుచుండు సుందరాంగనలు శీతఋతువున కలంకారములవలె నలరారుచున్నారు.

పయోధరైః కుఙ్కుమరాగపిఞ్జరైః
సుఖోపసేవ్యైః నవయౌవనోష్మభిః,
విలాసినీభిః పరిపీడితోరసః
స్వపన్తి శీతం పరిభూయ కామినః. 9

టీ. కామినః=కాముకులు, విలాసినీభిః=విలాసవతులచే, కుంకుమరాగపింజరైః-కుంకుమ=కుంకుమయొక్క, రాగ=రంగుచే, పింజరైః = పింజరవర్ణము కలిగి, సుఖోపసేవ్యైః-సుఖ=సుఖముగ, ఉపసేవ్యైః = అనుభవింపఁదగిన, నవ...ఊష్మభిః - నవ=నూతనమగు, యౌవన=యౌవనముయొక్క, ఊష్మభిః = ఉష్ణముకలిగిన, పయోధరైః = స్తనములచే, పరిపీడితోరసః - పరిపీడిత = పీడింపఁబడిన, ఉరసః=ఱొమ్ములు కలవారలై, శీతం=చలిని, పరిభూయ = తిరస్కరించి స్వపంతి = నిద్రించుచున్నారు.

తా. కాముకు లగుపురుషులు తమప్రియురాండ్రగువిలాసవతులు కుంకుమముయొక్క రంగంటుకొనుటచే పింజరము (ఎఱుపుకలిసిన పసిమివర్ణము) లై సుఖముగ ననుభవింపఁదగినయౌవనముచే వెచ్చనగు స్తనములచే నంటిపట్టి తమ్ము నాలింగనముఁ జేసికొని యుండ చలిని ధిక్కరించి సుఖముగ నిద్రించుచున్నారు.

సుగన్ధినిశ్వాసవికమ్పితోత్పలం
మనోహరం కామరతిప్రబోధకమ్,
నిశాసు హృష్టాః సహ కామిభిః స్త్రియః
పిబన్తి మద్యం మదనీయముత్తమమ్. 10

టీ. స్త్రియః=స్త్రీలు, హృష్టాః = సంతసించినవారలై. సుగన్ధి...ఉత్పలం-సుగంధి=పరిమళించుచుండు, నిశ్వాస = నిట్టూర్పులచే, వికంపిత = కదల్పఁబడిన, ఉత్పలం=కలువలుకలిగినదియు, మనోహరం = మనోహరమైనదియు, కామ... ప్రబోధకం-కామ = అధికముగ, రతి=రతికి, ప్రబోధకం = పెంపొందించెడు, మదనీయం=మదకరమగు, మద్యం=మద్యమును, కామిభిస్సహ = ప్రియులతోడ, నిశాసు=రాత్రులయందు, పిబంతి=త్రాగుచున్నారు.

తా. యువతులు సంతోషయుక్తలై తమప్రియులతోడఁ గూడి త్రాగునపుడు మంచివాసన గలనిట్టూర్పువాయువులు దగిలి మద్యమున వేయఁబడియుండుకలువలు గదలుచుండ మనోహరమై రతిప్రవర్ధకమై మదమును గలిగించుమద్యమును రాత్రులయందుఁ ద్రాగుచున్నారు.

అపగతమదరాగా యోషిదేకా ప్రభాతే
కృతనిబిడకుచాగ్రా పత్యురాలిఙ్గనేన
ప్రియతమపరిభుక్తం వీక్షమాణా స్వదేహం
వ్రజతి శయనవాసాద్ వాసమన్యద్ధసంతీ. 11

టీ. అపగత...రాగా-అపగత=పోయిన, మద = మదముయొక్క, రాగా=రాగముకలిగినదియు, పత్యుః=భర్తయొక్క, ఆలింగనేన = ఆలింగనముచేత కృత...అగ్రా-కృత=చేయఁబడిన, నిబిడ=ఎత్తగు, కుచ = కుచములయొక్క, అగ్రా=అగ్రములుకలిగిన, ఏకా=ఒక, యోషిత్=స్త్రీ, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, ప్రియతమపరిభుక్తం-ప్రియతమ = ప్రియునిచే, పరిభుక్తం = అనుభవింపఁబడిన, స్వదేహం-స్వ=తనయొక్క, దేహం = దేహమును, వీక్షమాణా =

చూచుచున్నదై, హసంతీ=నవ్వుచున్నదై, శయనవాసాత్ = పడకటింటినుండి, అన్యత్ = మఱియొక, వాసం = గృహమును, ప్రజతి=పొందుచున్నది.

తా. ఒకానొక స్త్రీ మద్యమదముయొక్క రాగమంతయుందగ్గి ప్రియుం డాలింగనముఁ జేసికొనుటచేఁ గుచాగ్రము లొత్తుకొనియుండఁ దనదేహమునం దలి ప్రియుని యనుభవముచేఁ దోఁచుచుండుగుర్తులను గని నవ్వుకొనుచు ప్రాతఃకాలమున పడకటింటినుండి మఱియొకయింటి కరుగుచున్నది.

అగురుసురభిధూపామోదితం కేశపాశం
గలితకుసుమమాలం తన్వతీ కుఞ్చితాగ్రం,
త్యజతి గురునితమ్బా నిమ్నమధ్యావసానా
ఉషసి శయనమన్యా కామినీ చారుశోభా. 12

టీ. అగురు=అగురుయొక్క, సురభి=సువాసనగల, ధూప = పొగఁబట్టుటచే, ఆమోదితం=వాసనకలిగించబడిన, కేశపాశం = కేశసమూహమును, గలిత...మాలం-గలిత=జారిన, కుసుమ=పూవులయొక్క, మాలం=మాలికకలిగినది గను, కుంచితాగ్రం-కుంచిత=ముడువఁబడిన, అగ్రం = చివరలుకలిగినదిగను, తన్వతీ=చేయుచుండినదియు, గురునితంబా-గురు = గొప్ప, నితంబా=పిరుదులు కలిగినదియు, నిమ్న...వసానా-నిమ్న=తగ్గిన, మధ్య = నడుముయొక్క, అవసానా=చివరకలినదియు, చారుశోభా-చారు = మనోహరమైన, శోభా = శోభ కలిగిన, అన్యా=మఱియొక్క, కామినీ=కామిని, ఉషసి=తెల్లవారుసమయమున శయ్యాం=పడకను, త్యజతి=విడుచుచున్నది.

తా. గొప్పపిరుఁదులును సన్ననినడుమును కలిగి మనోహరముగ శోభిల్లు చుండు మరియొకసుందరి అగరుచే పొగవేయుటచే సువాసనకలిగియుండు వెండ్రుకలను దులిపి పూలమాలికలను రాల్చి వైచి ముడి వైచుచు తెల్లవారు సమయమున పడకనుండి లేచుచున్నది.

కనకకమలకాన్తైః సద్య ఏవామ్బుధౌతైః
శ్రవణతటనిషక్తైః పాటలోపాన్తనేత్రైః,

ఉషసి వదనబిమ్బైరంససంసక్తకేశైః
శ్రియ ఇవ గృహమధ్యే సంస్థితా యోషితోఽద్య. 13

టీ. సద్య ఏవ=అప్పుడే, అంబుధౌతైః-అంబు=జలములచే, ధౌతైః=కడుగఁబడిన, కనక... కాంతైః-కనక=బంగరుయొక్క, కమల=కమలముల వలె, కాంతైః=మనోహరములైన, వదనబింబైః=ముఖబింబములతోడను, శ్రవణ...నిషక్తైః-శ్రవణ=చెవులయొక్క, తట=ఒడ్డునందు, నిషక్తైః=తగిలియుండెను, పాటల...నేత్రైః-పాటల=పాటల వర్ణమైన ఉపాంత=మధ్యభాగము కల, నేత్రైః=నేత్రములతోడను, అంస...కేశైః-అంస=మూఁపులయందు, సంసక్త=తగులుకొనిన, కేశైః=వెండ్రుకలతోడను, ఉపలక్షితాః=కూడుకొనిన, యోషితః=స్త్రీలు, అద్య=ఈఋతువునఁ, ఉషసి=ప్రాతఃకాలమునందు గృహమధ్యే=గృహమధ్యమందు, శ్రియఇవ=లక్ష్ములవలె,సంస్థితాః=ఉండియున్నారు.

తా. ఈఋతువున ప్రాతఃకాలమున స్త్రీలు అప్పుడే దంతధావనాదులఁ జేసికొని ముఖములఁ గడిగికొని యుండుటచే స్వచ్ఛమై బంగరు పద్మములవలె రాజిలుచుండు ముఖములతోడను చెవులవద్దకు వ్యాపించి పాటల మగు మధ్యభాగముగల కనులతోడను భుజములమీఁద పడియుండు వెండ్రుకలతోడను నొప్పుచు నిండ్లయందు లక్ష్ములో యన నలరారుచున్నారు.

పృథుజఘనభరార్తాః కిఞ్చిదానమ్రమధ్యాః
స్తనభరపరిఖేదాన్మందమన్దం వ్రజన్త్యః,
సురతసమయవేషం నైశమాశు ప్రహాయ
దధతి దివసయోగ్యం వేషమన్యాస్తరుణ్యః. 14

టీ. పృథు...ఆర్తాః పృథు=గొప్ప, జఘన=జఘనముయొక్క, భర=బరువుచేత, ఆర్తాః=పీడితలైనట్టియు, కించిద్...మధ్యాః-కించిత్=కొంచెము, ఆనమ్ర=వంగిన, మధ్యాః=మధ్యభాగములు కలిగినట్టియు, స్తన...ఖేదాత్-స్తన=స్తనములయొక్క, భర=బరువైన, పరిఖేదాత్=ఆయాసమువలనవలన

మందం=మెల్లమెల్లగా, ప్రజంత్యః=నడుచుచుండు, అన్యాః=ఇతరలగు, తరుణ్యః=తరుణులు, నైశం=రాత్రిసంబంధమగు, సురత...వేషం-సురతసమయ=రతిసమయమందలి, వేషం=వేషమును, ఆశు=శీఘ్రముగ, ప్రహాయ=విడిచి, దివసయోగ్యం-దివస=పగటియందు, యోగ్యం=తగిన, వేషం=వేషమును, అదధతి=ధరించుచున్నారు.

తా. గొప్ప జఘనస్థలముయొక్క భారముచేఁ బీడితలును స్తనముల భారమును సహింపఁజాలక మెల్లమెల్లగా నడచుచుండువారలును కొంచెముగ వంగిన మధ్యభాగములు కలిగినవారలును నగు మఱికొందఱు తరుణాంగనలు రాత్రియందు సురతసమయమున కుపయుక్తమగు రీతిని ధరింపఁబడిన వస్త్రాభరణాదులనెల్ల తీసివైచి పగటి కుపయోగించు వేషమును ధరించుచున్నారు.

నఖపదచితభాగా న్వీక్షమాణాః స్తనాగ్రాన్
అధరకిసలయాగ్రం దన్తభిన్నం స్పృశన్త్యః,
అభిమతరసమేతం నన్దయన్త్యస్తరుణ్యః
సవితురుదయకాలే భూషయన్త్యాననాని. 15

టీ. నఖ...భాగాన్-నఖ=గోళ్ళయొక్క, పద=చిహ్నములచే, చిత=వ్యాప్తములైన, భాగాన్=భాగములుకలిగిన, స్తనాగ్రాన్-స్తన=స్తనములయొక్క, అగ్రాన్=అగ్రములను, వీక్షమాణాః=చూచుచున్నట్టియు,దన్తభిన్నం-దంత=దంతములచే, భిన్నం=భేదించఁబడిన, అధర...అగ్రం-అధరకిసలయ=చిగురువంటి అధరముయొక్క, అగ్రం=చివరను, స్పృశంత్యః=ముట్టుచున్నట్టియు, ఏతం=ఈ, అభిమతరసం-అభిమత=ఇష్టమగు, రసం=రసమును, నందయంత్యః=సంతోషించుచుండు, తరుణ్యః=తరుణులు, సవితుః=సూర్యునియొక్క, ఉదయకాలే=ఉదయసమయమునందు, ఆననాని=ముఖములను, భూషయంతి=అలంకరించుచున్నారు.

తా. తరుణులు రాత్రి రతిసమయములయందు ప్రియులయొక్క నఖములచే క్షతముల నందియుండు కుచాగ్రములఁ బట్టి చూచుకొనుచును దన్తపు

కాటులు గలిగియుండు చిగురువంటి పెదవి ముట్టిచూచుకొనుచు తమ కిష్ట మైన రసములగు దంతక్షతనఖక్షతములఁ గనుటచే నానందింపుచు సూర్యోదయ వేళయందు ముఖములను తిలకాదులచే నలంకరించుకొనుచున్నారు.

ప్రచురగుడవికారః స్వాదుశాలీక్షురమ్యః
ప్రబలసురతకేలిః జాతకందర్పదర్పః,
ప్రియజనరహితానాం చిత్తసంతాపహేతుః
శిశిరసమయ ఏషః శ్రేయసే వోఽస్తు నిత్యమ్. 16

టీ. ప్రచురగుడవికారః-ప్రచుర=అధికములగు, గుడవికారః = గుడభేదములు కలిగినదియు, స్వాదు...రమ్యః-స్వాదు=రుచ్యములగు, శాలి = వరిచేతను, ఇక్షు=చెఱకుచేతను, రమ్యః = రమ్యమైనదియు, ప్రబల...కేళిః-ప్రబల అధికమగు, సురత=సురతముయొక్క, కేళిః=క్రీడకలిగినదియు, జాత...దర్పః-జాత=పుట్టిన, కందర్ప=మన్మథునియొక్క, దర్పః=గర్వముకలిగినదియు, ప్రియ జనరహితానాం-ప్రియజన = ప్రియులగు జనులచే, రహితానాం=శూన్యులగు వారలకు, చిత్త...హేతుః-చిత్త = మనసుయొక్క, సంతాప = తాపమునకు, హేతుః=హేతువైన, ఏషః = ఈ, శిశిరసమయః = శిశిరకాలము, నిత్యం=ఎల్లప్పుడును, వః=మీయొక్క, శ్రేయసే=శ్రేయస్సుకొఱకు, అస్తు=అగుగాక.

తా. గుడవికారము లగుబెల్లము కలకండ చక్కెర మొదలగునవి యధికముగ నుండునదియు రుచ్యము లగుక్రొత్తవరియు క్రొత్తచెఱకును నుండునదియు సురతకేళికి మిగులననుకూలమైనదియు కామోద్రేకమును కలిగించునదియు ప్రియులతో వియోగము నందియుండువారలకు మిగులదుఃఖమును కలిగించునదియు నగునీశిశిరకాలము మీకెల్లప్పుడు సుఖములఁగలుగఁజేయుఁగాక.

ఇది మహాకవి శ్రీకాళిదాసకవి విరచితమగు ఋతుసంహారకావ్యమున
శిశిరర్తువర్ణనమను పంచమసర్గము.

---

# షష్ఠసర్గము



అవ. శిశిరర్తువును వర్ణించిన యనంతరమున క్రమప్రాప్తమగు వసంతర్తువును వర్ణించుచున్నాఁడు.

శ్లో. ప్రఫుల్లచూతాఙ్కురతీక్ష్ణసాయకో
ద్విరేఫమాలావిలసద్ధనుర్గుణః,
మనాంసి వేద్ధుం సురతప్రసఙ్గినామ్
వసన్తయోద్ధా సముపాగతః ప్రియే. 1

టీ. హే ప్రియే = ఓ ప్రియురాలా! ప్రఫుల్ల... సాయకః-ప్రఫుల్ల = వికసించిన, చూతాంకుర = మామిడిచిగుళ్ళనియెడు, తీక్ష్ణ = తీక్ష్ణములగు, సాయకః= బాణములు కలిగినట్టియు, ద్విరేఫ... గుణః-ద్విరేఫ=తుమ్మెదలయొక్క, మాలా = పంక్తియనియెడు, విలసత్ = ఒప్పుచుండెడు, ధనుః = ధనుస్సుయొక్క, గుణః = నారికలిగిన, వసంతయోద్ధా = వసంత = వసంతఋతువనియెడు, యోద్ధా= యోధుఁడు, సురతప్రసంగినాం - సురత = రతియందు, ప్రసంగినాం=సంబంధించు వారియొక్క, మనాంసి = మనస్సులను, వేద్ధుం = చీల్చుటకు, సముపాగతః = వచ్చెను.

తా. ఓ ప్రియురాలా! వసంతుఁ డను నొకయోధుఁడు కాముకులమనస్సులను గురిగాఁ జేసికొని యాలక్ష్యము భేదించుటకై వికసించియుండు మామిచిగుళ్ళను బాణంబులును గైకొని తుమ్మెదపంక్తులను వింటినారి ధ్వనింపుచుండ సాయుధుఁడై బయలు వెడలి వచ్చెను.

శ్లో. ద్రుమాః సపుష్పాః సలిలం సపద్మం
స్త్రియః సకామాః పవనస్సుగన్ధిః.

సుఖాః ప్రదోషాః దివసాశ్చ రమ్యాః
సర్వం ప్రియే చారుతరం వసన్తే. 2

టీ. హే ప్రియే=ఓప్రియురాలా! వసంతే=వసంతర్తువునందు, ద్రుమాః =వృక్షములు, సపుష్పాః=పుష్పములతోఁ గూడియుండును. సలిలం = జలము, సపద్మం=పద్మములతోఁ గూడి యుండును. స్త్రియః = స్త్రీలు, సకామాః = కామముతోఁగూడియుందురు. పవనః = వాయువు, సుగంధిః = మంచిపరిమళముకలిగినదిగనుండును. ప్రదోషాః=సాయంకాలములు, సుఖాః = సుఖకరములైనవి. దివసాః=పగళ్ళు, రమ్యాః = రమ్యములైనవి. సర్వం = సమస్తమును, చారుతరం=మిగుల మనోహరమైనది.

తా. వసంతర్తువునందు వృక్షములన్నియు పూచియుండును. సరస్సులు మొదలగు జలాశయములయం దంతటను తామరపూవులుండును. స్త్రీలు కామినులై యుందురు, వాయువు పూవులగంధముతోఁ గలిసి పరిమళించుచుండును. సుగంధవంతము లగుచల్లనివాయువులు వీచుచుండుటచే సాయంసమయములు సుఖకరములై యుండును. అతితాపముగాని అతిశీతముగాని వర్షములుగాని లేకుండుటచే పగటివేళలు రమ్యములై యుండును. ఇట్టికాలమున నన్నియు మనోహరములై యలరారుచుండును.

శ్లో. వాపీజలానాం మణిమేఖలానాం
శశాఙ్కభాసాం ప్రమదాజనానామ్,
చూతద్రుమాణాం కుసుమాన్వితానాం
దదాతి సౌభాగ్యమయం వసన్తః. 3

టీ. అయం = ఈ, వసంతః = వసంతకాలము, వాపీజలానాం-వాపీ=దిగుడు బావులయొక్క, జలానాం = జలములకును, మణిమేఖలానాం - మణి = మణులచేఁగూర్పఁబడిన, మేఖలానాం = మొలపట్టీలకును, శశాంకభాసాం-శశాంక = చంద్రునియొక్క, భాసాం = కిరణములకును, ప్రమదాజనానాం=స్త్రీజనులకును, కుసుమాన్వితానాం - కుసుమ = పూవులతో, అన్వి

తానాం = కూడియుండు, చూతద్రుమాణాం=మామిడిచెట్లకును, సౌభాగ్యం = సౌభాగ్యమును, దదాతి=ఇచ్చుచున్నది.

తా. ఈవసంతఋతువున జలక్రీడల కుపయుక్తము లగుటచే దిగుడు బావులును ధరించుటకు వీలుగ నుండుటచే రత్నపుమొలపట్టీలును ననుభవయోగ్యము లగుటచే వెన్నెలలును సుఖదాయకులగుటచే సుందరీమణులును చెవులం మొదలగు వానియం దలంకరించుట కుపయోగించుపల్లవములు మొదలగునవి కలిగి యలరారుచుండుటచే పూచినమామిళ్ళును సౌభాగ్యవంతములైనవి.

శ్లో. కుసుమ్భరాగారుణితైర్దుకూలైః
నితమ్బబింబాని విలాసినీనామ్,
రక్తాంశుకైః కుఙ్కుమరాగగౌరై
రలంక్రియన్తే స్తనమణ్డలాని. 4

టీ. విలాసినీనాం=విలాసవతులయొక్క, నితంబబింబాని = పిరుదులు, కుసుంభ...అరుణితైః - కుసుంభ = కుసుంబాపూవుయొక్క, రాగ = రంగు చే, అరుణితైః = ఎఱ్ఱగాఁజేయఁబడిన, దుకూలైః = దువ్వలువలచేతను, స్తన మండలాని- స్తన = కుచములయొక్క, మండలాని = ప్రదేశములు, కుంకుమ గౌరైః-కుంకుమ = కుంకుమముయొక్క, రాగ = రంగుచే, గౌరైః = గౌర వర్ణములగు, రక్తాంశుకైః - రక్త = ఎఱ్ఱని, అంశుకైః = వస్త్రములచేతను, అలంక్రియంతే = అలంకరింపఁబడుచున్నవి.

తా. ఇప్పుడు విలాసవతులు కుసుంభారంగునద్దియుండు సన్ననిపావడలం గట్టి నితంబముల నలంకరించుకొనుచున్నారు. కుంకుమరంగు నద్దినవస్త్రములను పయటలుగా వేసికొని స్తనభాగముల నలంకరించుకొనుచున్నారు.

శ్లో. కర్ణేషు యోగ్యం నవకర్ణికారం
చలేషు నీలేష్వలకేష్వశోకమ్,
పుష్పం చ ఫుల్లం నవమల్లికాయాః
ప్రయాంతి కాన్తిం ప్రమదాజనానామ్. 5

టీ. ప్రమదాజనానాం=స్త్రీలయొక్క, కర్ణేషు = చెవులయందు, యోగ్యం = తగిన, కర్ణికారం = కొండగోగుపూవును, చలేషు = చంచలములగు, నీలేషు=నల్లని, అలకేషు = ముంగురులయందు, అశోకం=అశోకపుఁ బూవును నవమల్లికాయాః - నవ = నూతనమగు, మల్లికాయాః = మల్లెయొక్క, ఫుల్లం = వికసించిన, పుష్పంచ=పూవును, కాంతిం = శోభను, ప్రయాంతి= పొందుచున్నవి.

తా. స్త్రీజను లిప్పుడు కర్ణాభరణముగ నుంచుకొనఁదగిన కొండగోగు పూవును చెవులయం దలంకరించుకొనుచున్నారు. అశోకపుపూవును వికసించిన మల్లెపూవులను కదలుచుండు నల్లనిముంగురుల యం దలంకరించుకొనుచున్నారు.

శ్లో. స్తనేషు హారాః సితచన్దనార్ద్రాః
భుజేషు సఙ్గం వలయాఙ్గదాని,
ప్రయా న్త్యనఙ్గాతురమానసానాం
నితంబినీనాం జఘనేషు కాఞ్చ్యః. 6

టీ. అనంగ...మానసానాం-అనంగ=మన్మథునిచే, ఆతుర = పీడింపఁబడిన, మానసానాం=మనస్సుకలిగిన, నితంబినీనాం=స్త్రీలయొక్క, స్తనేషు = స్తనములయందు, సిత...ఆర్ద్రాః-సిత=తెల్లని, చందన = చందనముచే, ఆర్ద్రాః =తడిసిన, హారాః=హారములును, భుజేషు = భుజములయందు, వలయాంగదాని-వలయ=కంకణములును, అంగదాని=దండకడియములును, జఘనేషు = జఘనములయందు, కాఞ్చ్యః=మొలదట్టీలును, సంగం=సంబంధమును, ప్రయాంతి= పొందుచున్నవి.

తా. కామోద్దీపితు లగుసుందరు లిప్పుడు మేన నలఁదుకొనిన చందనముచేఁ దడిసియుండుహారములను స్తనములయందును కంకణములను దండకడియములను చేతులయందును మొలదట్టీలను జఘనములయందును నలంకరించుకొనుచున్నారు.

సపత్రలేఖేషు విలాసినీనాం
వక్త్రేషు హేమాంబురుహోపమేషు,
రత్నాన్తరే మౌక్తికసఙ్గరమ్యః
స్వేదాగమో విస్తరతా ముపైతి. 7

టీ. విలాసినీనాం=విలాసవతులయొక్క, సపత్రలేఖేషు=మకరికాపత్రపురేఖలతోఁ గూడిన, హేమ...ఉపమేషు-హేమ = బంగరుయొక్క, అంబురుహ=పద్మముతో, ఉపమేషు = సామ్యముగలిగిన, వక్త్రేషు = ముఖములయందు, స్వేదాగమః - స్వేద=చెమటయొక్క, ఆగమః = వెడలుట, రత్నాంతరే=మణియొక్కరత్నమున, మౌక్తిక...రమ్యః-మౌక్తిక = ముత్యములయొక్క, సంగ = సంబంధమువలె, రమ్యః=రమ్యమైనదై, విస్తరతాం=వృద్ధిఁబొందుటను, ఉపైతి=పొందుచున్నది.

తా. ఇప్పుడు మకరికాపత్రములు లిఖింపఁబడి బంగరుకమలములఁ బోలియుండు విలాసవతులయొక్క ముఖములయందు చెమట బయలువెడలి రత్నమున ముత్యములు పొదిగినట్లు రమ్యమై పెంపొందుచున్నది.

ఉచ్ఛ్వాసయన్త్యః శ్లథబన్ధనాని
గాత్రాణి కన్దర్పసమాకులాని,
సమీపవర్తిష్వధునా ప్రియేషు
సముత్సుకా ఏవ భవన్తి నార్యః. 8

టీ. అధునా=ఇప్పుడు, నార్యః=స్త్రీలు,శ్లథబంధనాని-శ్లథ=వదులుగాఁ జేయఁబడిన, బంధనాని=ముడులుకలిగిన, కందర్పసమాకులాని-కందర్ప = మన్మథునిచే, సమాకులాని=వ్యాకులములైన, గాత్రాణి = అవయవములను, ఉచ్ఛ్వాసయన్త్యః=నిట్టూర్పుకలిగించుచు, సమీపవర్తిషు=సమీపముననుండు, ప్రియేషు=ప్రియులయందు, సముత్సుకా ఏవ=వేడుకఁగలవారలుగనే, భవంతి = అగుచున్నారు.

తా. ఇప్పుడు స్త్రీ లెండవేడిమి మొదలగువానిచే పోకముడి రవిక ముడి మొదలగువానిని సడల్చి నిట్టూర్పు పుచ్చుచునుండున వయవములు కలిగి యుండియు సమీపముననుండుతమప్రియులపై కామము కలవారుగనే యగుచున్నారు.

తనూని పాణ్డూని సమన్థరాణి
ముహుర్ముహుర్జృంభణతత్పరాణి,
అఙ్గాన్యనఙ్గః ప్రమదాజనస్య
కరోతి లావణ్యససంభ్రమాణి. 9

టీ. అనంగః=మన్మథుఁడు, ప్రమదాజనస్య=స్త్రీజనముయొక్క, అంగాని=శరీరములను, తనూని = సూక్ష్మమైనవిగను, పాణ్డూని = తెల్లనైనవిగను, సమంథరాణి = మాంద్యముతోఁగూడినవిగను, ముహుర్ముహుః=మాటిమాటికి జృంభణతత్పరాణి-జృంభణ=ఆవలించుటయందు, తత్పరాణి=ఆసక్తికలిగినవిగను, లావణ్యససంభ్రమాణి - లావణ్యా=లావణ్యముచే, ససంభ్రమాణి=సంభ్రమముతోఁగూడినవిగను, కరోతి=చేయుచున్నాఁడు.

తా. ఈఋతువున స్త్రీలదేహములు కృశములై తెల్లనై జడములై మాటిమాటికి నావలించుస్వభావము కలిగి లావణ్యపూర్ణములై కామపూరితములై మన్మథోద్రేకమును కలిగించునవై యున్నవి.

నేత్రేషు లోలో మదిరాలసేషు
గండేషు పాండుః కఠినః స్తనేషు
మధ్యేషు నిమ్నో జఘనేషు పీనః
స్త్రీణామనఙ్గో బహుధా స్థితోఽద్య. 10

టీ. అద్య=ఇప్పుడు, అనంగః = మన్మథుఁడు, మదిరాలసేషు-మదిరా=మద్యముచే, అలసేషు=మందములైన, స్త్రీణాం=స్త్రీలయొక్క, నేత్రేషు=నేత్రములయందు, లోలః=చంచలుఁడుగను, గండేషు=కపోలములయందు, పాండుః=తెల్లనైనవాఁడుగను, స్తనేషు = స్తనములయందు, కఠినః = కఠినమైనవాఁడు

గను, మధ్యేషు=నడుములయందు, నిమ్నాః=సన్నమైనవాఁడుగను, జఘనేషు = జఘనములయందును, పీనః=బలిసినవాఁడుగను, బహుధా = అనేకరీతుల, స్థితః = ఉండియున్నాఁడు.

తా. ఇప్పుడు మద్యపానముచే మత్తుగ నుండు స్త్రీల నేత్రములు చాంచల్యమును వహించుచున్నవి. చెక్కిళ్లు తెల్ల నగుచున్నవి. స్తనములు కఠినములుగ నున్నవి. మధ్యములు సన్నములగుచున్నవి. జఘనములు బలిసి విశాలములగుచున్నవి. ఇట్లు స్త్రీలయవయవము లన్నియు కామస్థానములై మన్మథోద్దీపకములుగ నున్నవి.

అఙ్గాని నిద్రాలసవిభ్రమాణి
వాక్యాని కిఞ్చిన్మదలాలసాని,
భ్రూక్షేపజిహ్మాని చ వీక్షణాని
చకార కామః ప్రమదాజనానామ్. 11

టీ. కామః=మన్మథుఁడు, ప్రమదాజనానాం = స్త్రీజనములయొక్క, అంగాని=అవయవములను, నిద్రా...విభ్రమాణి - నిద్రా=నిద్దురచే, అలస = బద్ధకము కలిగిన, విభ్రమాణి = విలాసములుకలవిగను, వాక్యాని = మాటలను, కించిత్...లాలసాని-కించిత్=కొంచెము, మద=మదముచే, లాలసాని = మనోహరములుగను,వీక్షణాని=చూపులను,భ్రూ...జిహ్మాని-భ్రూ = కనుబొమలయొక్క, క్షేప=విసురుల చే, జిహ్మాని=కుటిలములుగను, చకార=చేసెను.

తా. ఈఋతువు వచ్చినంతనే మన్మథవ్యాప్తి కలిగి స్త్రీకనులయవయవములన్నియు నిద్దురబద్ధకముతోఁగూడి విలాసవంతములుగ నున్నవి. మాటలు కొంచెముగ మదసంబంధము కలిగి సుందరముగ నున్నవి. చూపులు బొమముడు లువడుటచే కుటిలములై యున్నవి. ఈస్థితి మదనావేశమును చూపుచున్నది.

ప్రియంగుకాలీయకకుఙ్కుమాక్తం
స్తనేషు గౌరేషు విలాసినీభిః,

అలిప్యతే చన్దనమఙ్గనాభిః
మదాలసాభిర్మృగనాభియుక్తమ్. 12

టీ. విలాసినీభిః=విలాసవతులైన, మదాలసాభిః-మద = మదముచే, అల సాభిః=బద్ధకముకలిగియుండు, అంగనాభిః=స్త్రీలచే. గౌరేషు = గౌరవర్ణము లగు, స్తనేషు = స్తనములయందు, ప్రియంగు ..ఆక్తం-ప్రియంగు = ప్రేంక ణముతోడను, కాలీయక = కస్తూరిపసుపుతోడను, కుంకుమ = కుంకుమపూవు తోడను, ఆక్తం=మెదుపఁబడిన, మృగనాభియుక్తం-మృగనాభి = కస్తూరితో, యుక్తం=కూడిన, చందనం=గంధము, అలిప్యతే=పూయఁబడుచున్నది.

తా. ఇప్పుడు విలాసవతులును మదముచే నలసలును నగు సుందరాంగ నలు ప్రేంకణపూవులును కస్తూరిపసుపును కుంకుమపూవును చేర్చి మెదిపి తీయఁ బడిన చందనమున కస్తూరిని కలిపి గౌరవర్ణము లగుతమకుచములయం దలఁదు కొనుచున్నారు.

గురూణి వాసాంసి విహాయ తూర్ణం
తనూని లాక్షారసరఞ్జితాని,
సుగన్ధికాలాగురుధూపితాని
ధత్తే జనః కామమదాలసాఙ్గః. 13

టీ. కామ...అంగః-కామ=కామముచేనైన, మద=మదముచే, అలస =మాంద్యముకలిగిన, అంతః=అవయవములుగల, జనః=జనమును, గురూణి=మొ ద్దువగు, వాసాంసి=వస్త్రములను. తూర్ణం=త్వరగ, విహాయ=విడిచి, తనూని= సన్నములై, లాక్షా...రంజితాని-లాక్షా=లత్తుకయొక్క, రస=రసముచే, రంజి తాని=రంగువేయఁబడిన, సుగంధి=మంచివాసనగల, కాలాగురు=నల్లయగురుచే, ధూపితాని=పొగఁబెట్టఁబడిన, వాసాంసి=వస్త్రములను, ధత్తే = ధరించుచున్నది.

తా. ఇప్పుడు జనులు చెమటను బుట్టించి చీదరగ నుండును గాన మందుక బట్టల తీసివైచి లత్తుకరంగుచే నద్దఁబడిన సన్ననివస్త్రములను నల్ల యగరుధూపములను వేసి కట్టుకొనుచున్నారు.

పుంస్కోకిలః చూతరసాసవేన
మత్తః ప్రియాం చుమ్బతి రాగహృష్టః,
కూజద్ద్విరేఫోప్యయమమ్బుజస్థః
ప్రియం ప్రియాయాః ప్రకరోతి చాటు. 14

టీ. చూత...ఆసవేన-చూత = మామిడిచిగుళ్లయొక్క, రస=రసమనెడు, ఆసవేన=మద్యముచే, మత్తః=మదించిన, రాగ హృష్టః-రాగ = అనురాగముచే, హృష్టః=సంతసించిన, పుంస్కోకిలః=పురుషకోకిలము, ప్రియాం =ప్రియురాలిని, చుంబతి=ముద్దుగొనుచున్నది. అంబుజస్థః-అంబుజ=తామరపూవునందు, స్థః=ఉండు, అయం=ఈ, కూజద్ద్విరేఫః-కూజత్=గానముచేయుచుండు, ద్విరేఫః=తుమ్మెద, ప్రియాయాః=ప్రియురాలికి, ప్రియం = ఇష్టమగు, చాటు=నర్మకృత్యమును, ప్రకరోతి=చేయుచున్నది.

తా. పురుషకోకిలము ఈఋతువున బాగుగ చిగిర్చియుండు మామిడిచిగుళ్లను మెక్కి యాసవమువంటి యారసమును త్రాగుటచే మదించి యనురాగముచే సంతసమునయినదై దనకు ప్రియ యగు నాఁడుకోకిలను ముద్దుఁగొనుచున్నది. తుమ్మెదయును కమలములయం దుండి పూదేనె ద్రాగుచు ఝుంకారముఁ జేయుచు నాఁడుతుమ్మెదకు సంతసమును కలుగఁ జేయునట్లు నర్మవ్యాపారంబులఁ జేయుచున్నది.

తామ్రప్రవాళస్తబకావనమ్రాః
చూతద్రుమాః పుష్పితచారుశాఖాః,
కుర్వన్తి కామం పవనావధూతాః
పర్యుత్సుకం మానసమఙ్గనానామ్. 15

టీ. తామ్ర...అవనమ్రాః - తామ్ర=ఎఱ్ఱని, ప్రవాళ=చిగుళ్లయొక్క, స్తబక=గుత్తులచే, అవనమ్రాః=వంగినవియును, పుష్పిత...శాఖాః-పుష్పిత=పుష్పించిన, చారు=మనోహరములగు, శాఖాః=కొమ్మలు కలిగినవియును, పవనావధూ

తాః-పవన=వాయువుచే, అవధూతాః=కదల్పఁబడిన చూతద్రుమాః = మామిడి చెట్లు, అంగనానాం=స్త్రీలయొక్క, మానసం=మనస్సును, కామం = మిక్కిలి, సర్యుత్సుకం=వేడుకకలిగినదిగ, కుర్వంతి=చేయుచున్నవి.

తా. ఎఱ్ఱని చిగుళ్ళగుత్తులు వంగియుండ పూచినకొమ్మలచే నలరారుచు గాలికి కదలుచుండు మామిళ్లు చూడ నెంతయు రమ్యములై స్త్రీలమనస్సుల నెంతయు నలర్చుచున్నవి.

ఆమూలతో విద్రుమ రాగతామ్రం
సపల్లవాః పుష్పచయం దధానాః,
కుర్వన్త్యశోకా హృదయం సశోకం
నిరీక్ష్యమాణా నవయౌవనానామ్.　　16

టీ. ఆమూలతః=మొదటినుండియు, విద్రుమ ... తామ్రం-విద్రుమ= పగడములయొక్క, రాగ=రంగువలె, తామ్రం = ఎఱ్ఱనైన, పుష్పచయం - పుష్ప=పూవులయొక్క, చయం=సమూహమును, దధానా = ధరించుచున్నవి యు, సపల్లవాః = చిగుళ్ళతోఁగూడియున్నవియు, నిరీక్షమాణాః = చూడఁ బడుచుండెడు, అశోకాః = అశోకవృక్షములు, నవయౌవనానాం-నవ = నూ తనమగు, యౌవనానాం=యౌవనముకలవారియొక్క, హృదయం=హృదయ మును, సశోకం = దుఃఖముతోఁగూడినదిగ, కుర్వంతి = చేయుచున్నవి.

తా. అంతట నెఱ్ఱనై పగడపురంగు కలిగి యుండు పూవులతోడను చిగుళ్ళతోడను నలరారు చుండునశోకములం గనినంతనే క్రొత్తవయసున నుండు సుందరులహృదయములు కామాతురతచే శోకవంతము లగుచున్నవి.

మత్తద్విరేఫపరిచుమ్బితచారుపుష్పాః
మన్దానిలాకులితనమ్రమృదుప్రవాళాః,
కుర్వన్తి కామిమనసాం సహసోత్సుకత్వం
చూతాభిరామకలికాస్సముదీక్ష్యమాణాః.　　17

టీ. మత్త...పుష్పాః-మత్త=మదించిన, ద్విరేఫ = తుమ్మెదలచే, పరిచుంబిత=పీల్చఁబడిన, చారు=మనోహరములగు, పుష్పాః=పూవులుకలిగినవియును, మంద...ప్రవాళాః - మంద=మెల్లనైన, అనిల = వాయువుచే, ఆకులిత=కదల్పఁబడిన, నమ్ర = వంగిన, మృదు=మెత్తని, ప్రవాళాః = చిగురులుకలిగిన, చూత...కలికాః-చూత=మామిడియొక్క, అభిరామ = మనోహరములగు, కలికాః=ముదురుమొగ్గలు, సమవేక్ష్యమాణాః = చూడఁబడుచున్నవై, కామిమనసాం-కామి = కాముకులయొక్క, మనసాం=మనస్సులకు, సహసా = బలాత్కారముగా, ఉత్సుకత్వం = వేడుక కలిగిన నగుటను, కుర్వంతి = చేయుచున్నవి.

తా. మదించినతుమ్మెదలు పూవులపై వ్రాలి తేనెల నానుచుండ మెల్లని గాడ్పులకుఁ గదలుచు వంగియుండుకోమలము లగు చిగుళ్ళచే నొప్పుచుండు మామిడిపూమొగ్గలు కాముకు లగువారిమనస్సులయందు బలముగ నుత్కంఠను కలిగింపుచున్నవి.

కాన్తాముఖద్యుతిజుషామపి చోద్గతానాం
శోభాం పరాం కురవకద్రుమమంజరీణామ్,
దృష్ట్వా ప్రియే సహృదయస్య భవేన్న కస్య
కన్దర్పబాణపతనవ్యథితం హి చేతః. 18

టీ. హే ప్రియే = ఓప్రియురాలా! కాన్తా...జుషాం - కాంతా = ప్రియురాలియొక్క, ముఖ=ముఖముయొక్క, ద్యుతి=కాంతిని, జుషాం=పొందినవియును, అపిచ = మఱియును, ఉద్గతానాం = బయలువెడలిన, కురవకద్రుమమంజరీణాం - కురవకద్రుమ = ఎఱ్ఱగోరింటచెట్లయొక్క, మంజరీణాం = పూగుత్తులయొక్క, పరాం = అధికమగు, శోభాం=శోభను, దృష్ట్వా=చూచి, సహృదయస్య=సహృదయుఁడగు, కస్య=ఎవనియొక్క, చేతః=మనసు, కందర్ప..వ్యథితం-కందర్ప=మన్మథునియొక్క, బాణ = బాణములయొక్క, పతన=పడుటచే, వ్యథితం = పీడింపఁబడినది, న భవేత్ —కాదు?

తా. ఓప్రియురాలా! ఈఋతువుల సుందరాంగనల ముఖశోభను బోలుచు బయలు వెడలుచుండు నెఱ్ఱగోరింట పూలగుత్తులయొక్క నుంచిశోభను గనినచో మంచిమనసు కలిగియుండు నెవ్వని హృదయమున కాముని బాణపాతమువలనఁ గలుగుపీడ యుద్భవింపదు? అందఱిహృదయములను నుద్భవించునఁట.

ఆదీప్తవహ్నిసదృశైర్మరుతావధూతైః
సర్వత్ర కింశుకవనైః కుసుమావనమ్రైః,
సద్యో వసన్తసమయే హి సమాచితేయం
రక్తాంశుకా నవవధూరివ భాతి భూమిః. 19

టీ. వసంతసమయే = వసంతకాలమునందు, సద్యః = అప్పుడు, ఆదీప్తవహ్నిసదృశైః - ఆదీప్త = ప్రజ్వలింపఁజేయఁబడిన వహ్ని=అగ్నితో, సదృశైః = సమానములైన, మరుతా=గాలిచే, అవధూతైః = కదల్పఁబడిన, కుసుమావనమ్రైః - కుసుమ = పూలచే, అవనమ్రైః = వంగిన, కింశుకవనైః - కింశుక=పలాశములయొక్క, వనైః-వనములచే, సర్వత్ర = అంతటను, సమాచితా= వ్యాపింపఁబడిన, ఇయం=ఈ, భూమిః=భూమి, రక్తాంశుకా-రక్త=ఎఱ్ఱని, అంశుకా=వస్త్రములు కలిగిన, నవవధూ రివ - నవ=నూతనయగు, వధూరివ = కోడలువలె, భాతి = ప్రకాశించుచున్నది.

తా. ఈవసంతకాలమున చెట్టునిండుగ పూవులుపూచి గాలికిఁ గదలుచునప్పుడే రగుల్పఁబడి మండుచుండునిప్పులవలె నుండు పలాశవృక్షము లంతటను వ్యాపించి యుండుసీభూమి యంతయు నెఱ్ఱనికోకఁ గట్టుకొనిన క్రొత్తకోడలివలె నున్నది,

కిం కింశుకైః శుకముఖచ్ఛవిభిర్న భిన్నం
కిం కర్ణికారకుసుమైర్న కృతం ను దగ్ధమ్,
యత్ కోకిలః పునరయం మధురైర్వచోభిః
యూనాం మనః సువదనానిహితం నిహన్తి. 20

టీ. సువదనానిహితం-సువదనా = సుందరముఖములు కలిగిన ప్రియురాండ్రయందు, ఆనిహితం=దాఁచియుంచఁబడిన, యూనాం = యౌవనుల, మనః=మనస్సు, శుకముఖచ్ఛవిభిః-శుక = చిలుకయొక్క, ముఖ=ముఖమువంటి, ఛవిభిః = కాంతికలిగిన, కింశుకైః = పలాశపుపూవులచే, న భిన్నం కిం=చీల్చఁబడలేదా? కర్ణికారకుసుమైః = కొండగోగుపూవులచే, దగ్ధం = తగులపెట్టఁబడినదై, ను=నిశ్చయముగా, న కృతం కిం=చేయఁబడలేదా? యత్ =ఎందువలన, అయం=ఈ, కోకిలః=కోకిలము, మధురైః = మధురములగు, వచోభిః = కూఁతలచే, నిహన్తి=బాధించుచున్నదో ?

తా. ఈఋతువున నెల్లయెడలను వ్యాపించియుండు కోకిలలకూఁతలు సుందరాంగనలయం దాసక్తమై వారియందుంపఁబడి యుండు పిన్నవయసు వారలహృదయముల నికను వేధించుచున్నది. దీనినిబట్టి చూడ వారలయం దుంపఁబడియుండు నీహృదయము లింతవఱకును చిలుకముక్కులవలె నుండు పలాశపుపూవులచే చీల్చఁబడలేదనియుం నిప్పులరవ్వలవలె నుండు కొండగోగు పూవులచే తగులబెట్టఁబడలేదనియు నూహింపఁదగియున్నది. అనఁగానీఋతువున కామాధీనమై సుందరులయందు లగ్నంబై యుండుయౌవనుల హృదయంబులు చిలుకముక్కులవంటి పలాశపుష్పములచే చీల్పఁబడునట్లును చింత నిప్పులవంటి కొండగోగుపూవులచే తగులఁబెట్టఁ బడుచుండునట్లును పీడితము లగుటయే గాక కోకిలారావములచే మిగులవ్యథనొందుచున్నవని యాశయము.

పుంస్కోకిలైః కలవచోభిరుపాత్తహర్షైః
కూజద్భిరున్మదకలాని వచాంసి భృంగైః,
లజ్జాన్వితం సవినయం హృదయం క్షణేన
పర్యాకులం కులగృహేఽపి కృతం వధూనామ్. 21

టీ. కలవచోభిః-కల=అవ్యక్తమధురములగు, వచోభిః=కూఁతలుకలిగినవియు, ఉపాత్తహర్షైః-ఉపాత్త=పొందఁబడిన, హర్షైః=సంతోషముకలిగిన, పుంస్కోకిలైః=పురుషకోకిలములచేతను, ఉన్మదకలాని-ఉన్మద=బయలువెడలి

నమదముచే, కలాని=అవ్యక్తమధురములగు, వచాంసి=ఝుంకారములను, కూజద్భిః=కూయుచుండెడి, భృంగైః=తుమ్మెదలచేతను, లజ్జాన్వితం-లజ్జా=లజ్జతో, అన్వితం=కూడినదియు, సవినయం=వినయముతోఁగూడిన, వధూనాం=కోడండ్రయొక్క, హృదయం=మనస్సు, కులగృహేఽపి=అత్తింటియందును, క్షణేన=క్షణకాలమున, పర్యాకులం=వ్యాకులముగా, కృతం=చేయఁబడినది.

తా. చూతపల్లవాదుల భక్షించుటచే సంతసము కలిగి మనోహరముగఁ గూయుచుండు కోకిలముల కూఁతలచేతను మదించి మనోహరముగ ధ్వనించు తుమ్మెదల ఝుంకృతులచేతను ఉద్వేజిత మై లజ్జావినయములతోఁ గూడి యత్తిండ్లనుఁడు కోడండ్ర మనసులుకూడ క్షణకాలమున వ్యాకుల మగుచున్నవి.

ఆకమ్పయన్కుసుమితాః సహకారశాఖాః
విస్తారయన్పరభృతస్య వచాంసి దిక్షు,
వాయుర్వివాతి హృదయాని హరన్నరాణాం
నీహారపాతవిగమాత్సుభగో వసన్తే. 22

టీ. వసంతే = వసంతకాలమున, నీహార...విగమాత్ - నీహార=మంచుయొక్క, పాత=పడుటయొక్క, విగమాత్ =నాశమువలన, సుభగః=మనోహరమగు, వాయుః=వాయువు, కుసుమితాః=పుష్పించిన, సహకారశాఖాః - సహకార=తియ్యమామిళ్ళయొక్క, శాఖాః=కొమ్మలను, ఆకంపయన్ = కదల్చుచు, పరభృతస్య=కోకిలముయొక్క, వచాంసి=కూఁతలను, దిక్షు=దిక్కులయందు, విస్తారయన్ =వ్యాపింపఁ జేయుచు, నరాణాం = మనుష్యులయొక్క, హృదయాని=మనస్సులను, హరన్=హరించుచు, వివాతి=వీచుచున్నది.

తా. ఈవసంతకాలమున మంచుపడకుండును కావున సుఖముగ నుండు వాయువులు పూచియుండు తీయమామిడిచెట్లను కదల్చుచు కోకిలారావములను దిక్కులయం దెల్లయెడలను వ్యాపింపఁజేయుచు సర్వజనహృదయంగమ మై వీచుచున్నది.

కున్దైః సవిభ్రమవధూహసితావదాతై
రుద్యోతితాన్యుపవనాని మనోహరాణి,
చిత్తం మునేరపి హరన్తి నివృత్తరాగం
ప్రాగేవ రాగమలినాని మనాంసి యూనామ్. 33

టీ. సవిభ్రమ...అవదాతైః-సవిభ్రమ=విలాసముతోఁగూడిన, వధూ=స్త్రీలయొక్క, హసిత=నవ్వువలె, అవదాతైః=తెల్లని, కున్దైః = మల్లెలచే, ఉద్యోతితాని = ప్రకాశింపఁజేయఁబడిన, మనోహరాణి=మనోహరములగు-ఉపవనాని=ఉద్యానవనములు, నివృత్తరాగం-నివృత్త=నశించిన, రాగం=విషయాభిలాషలుకలిగిన, మునేః=మునియొక్క, చిత్తమపి = మనస్సున్ను, హరన్తి=హరించుచున్నవి. రాగమలినాని - రాగ=విషయాభిలాషలచే, మలినాని=కలుషములైన, యూనాం=యౌవనులయొక్క, మనాంసి=మనసులను, ప్రాగేవ=పూర్వమే, హరంతి=హరించుచున్నవి.

తా. విలాసవతులగునంగనలనవ్వులం బోలి తెల్లనై యొప్పుచుండు మల్లెపూవులచే నలరారెడు నుద్యానవనంబులు విషయాభిలాషలు నశించియుండు మునులహృదయములను గూడ నాకర్షింపుచున్నవి. రాగపూరితములగువయసుకాండ్రమనసుల నంతకుపూర్వమే యాకర్షించుచున్నవి.

ఆలమ్బిహేమరశనాః స్తనసక్తహారాః
కన్దర్పదర్పశిథిలీకృతగాత్రయష్ట్యః,
మాసే మధౌ మధురకోకిలభృఙ్గనాదైః
నార్యో హరన్తి హృదయం ప్రసభం నరాణామ్. 24

టీ. మధౌ మాసే=వసంతకాలమున, ఆలంబిహేమరశనాః ఆలంబి = వ్రేలుచుండు, హేమరశనాః=బంగరుమొలనూళ్ళుకలిగిన, స్తనసక్తహారాః-స్తన=స్తనములయందు, సక్త=తగిలియుండు, హారాః=హారములుకలిగిన, కంద ర్ప...యష్ట్యః-కందర్ప = మన్మథునియొక్క, దర్ప=గర్వముచే, శిథిలీకృత=

శిథిలముగాఁ జేయఁబడిన, గాత్రయష్ట్యః=యష్టివంటి శరీరములుకలిగిన, నార్యః = స్త్రీలు, మధుర... నాదైః-మధుర=ఇంపగు, కోకిల = కోకిలములయొక్కయు, భృంగ=తుమ్మెదలయొక్కయు, నాదైః=కూఁతలతోఁగూడ, నరాణాం= పురుషులయొక్క, హృదయాని=మనసులు, ప్రసభం=బలాత్కారముగా, హరంతి=హరించుచున్నారు.

తా. ఈఋతువున కటిభాగములయందు బంగరుమొలదట్టీలు వ్రేలాడు చుండ స్తనములపైనుండి హారములు ధరించి మన్మథోద్రేకముచే దేహములు శిథిలములై యున్నందునుందరాంగనలును కోకిలారావములును తుమ్మెదరొదలును పురుషులహృదయములను బలాత్కారముగా నాకర్షించుచున్నవి.

నానామనోజ్ఞకుసుమద్రుమభూషితాన్తాన్
హృష్టాన్యపుష్టనినదాకులసానుదేశాన్,
శైలేయజాలపరిణద్ధశిలాతలౌఘాన్
దృష్ట్వా జనః క్షితిభృతో ముదమేతి సర్వః.　　25

టీ. నానా...అన్తాన్-నానా=అనేకములగు, మనోజ్ఞ=మనోహరములగు, కుసుమద్రుమ=పూలచెట్లచే, భూషిత = అలంకరింపఁబడిన, అంతాన్= మధ్యభాగములు కలిగినవియును, హృష్ట...దేశాన్-హృష్ట=సంతోషముగల అన్యపుష్ట=కోకిలములయొక్క. నినద=ధ్వనులచే, ఆకుల=వ్యాకులమైన, సాను= చరియలయందలి, దేశాన్=ప్రదేశములుకలిగినవియును, శైలేయ...ఓఘాన్-శైలేయ=శిలాజతువుయొక్క, జాల=సమూహముచే, పరిణద్ధ=చుట్టఁబడిన, శిలాతల=ఱాతిప్రదేశములయొక్క, ఓఘాన్=సమూహములుకలిగిన, క్షితిభృతః= పర్వతములను, దృష్ట్వా=చూచి, సర్వః = సమస్తమగు, జనః=జనము, ముదం= సంతోషమును, ఏతి=పొందుచున్నది.

తా. అనేకరీతుల పూలచెట్లు పుష్పించి మనోహరములై కొండల నడుమ నలరారుచుండ కోకిలములు సంతసముగఁ గూయుచుండ చరియలలో శిలా

గుచుండ ఎండవేఁడిమికి కొండతాళ్లు పగిలి శిలాజతువు బయలువెడలి దానిచే చుట్టఁబడి యుండుటచే తాళ్లు కలిగియుండు కొండలభూమి యీఋతువున చూడఁ జూడ జనుల కత్యంతమగు మోదమును కలిగించుచున్నవి.

నేత్రే నిమీలయతి రోదితి యాతి శోకం
ఘ్రాణం కరేణ నిరుణద్ధి విరౌతి చోచ్చైః,
కాంతావియోగ పరిఖేదితచిత్తవృత్తిః
దృష్ట్వాఽధ్వగః కుసుమితాన్ సహకారవృక్షాన్. 26

టీ. అధ్వగః=పాంథుఁడు కుసుమితాన్=పుష్పించిన,సహకారవృక్షాన్=తీయమామిడిచెట్లను, దృష్ట్వా=చూచి, కాంతా...వృత్తిః-కాంతా=ప్రియురాలియొక్క, వియోగ=ఎడబాటుచే, పరిఖేదిత=దుఃఖపెట్టఁబడిన, చిత్త=మనస్సుయొక్క, వృత్తిః=స్థితికలవాఁడై, నేత్రే=కనులను, నిమీలయతి=మూయుచున్నాఁడు,రోదితి=ఏడ్చుచున్నాఁడు, శోకం=దుఃఖమును,యాతి=పొందుచున్నాఁడు, కరేణ = చేతితో, ఘ్రాణం = ముక్కును, నిరుణద్ధి = మూయుచున్నాఁడు, ఉచ్చైః=బిగ్గరగ, విరౌతి=అరచుచున్నాఁడు.

తా. బాటసారి యీఋతువున బాగుగఁ బుష్పించి కామోద్దీపకమై యుండుతీయమామిళ్లం గని ప్రియురాలివియోగముచేఁ గామము రేఁగి దుఃఖమతిశయించి మనసు నిలువక యవి కనుపడకుండుటకై కనులమూయును. మోహాతిరంబునకుఁ దాళఁజాలక యేడ్చును. దుఃఖించును. పరిమళము సోకకుండ ముక్కుల మూసికొనును. బిగ్గరగ నఱచును. ఇట్లెన్నియో వికారములకుఁ బాల్పడును.

సమదమధుకరాణాం కోకిలానాం చ నాదైః
కుసుమితసహకారైః కర్ణికారైశ్చ రమ్యైః,
ఇషుభిరివ సుతీక్ష్ణైర్మానసం మానినీనాం
తుదతి కుసుమమాసో మన్మథోద్దీపనాయ. 27

టీ. రమ్యాః=రమ్యములగు, కుసుమమాసః=వసంతఋతువు, సమదమధుకరాణాం-సమద=మదముతోఁగూడిన, మధుకరాణాం=తుమ్మెదలయొక్కయు, కోకిలానాంచ=కోకిలలయొక్కయు, నాదైః=ధ్వనులచేతను, కుసుమితసహకారైః-కుసుమిత=పూచిన, సహకారైః=తీయమామిళ్ళచేతను, కర్ణికారైః=కొండగోఁగులచేతను, తీక్ష్ణైః=తీక్ష్ణములగు, ఇషుభిరివ = బాణములచేతవలె, మానినీనాం=స్త్రీలయొక్క, మానసం=మనస్సు, మన్మథోద్వేజనాయ-మన్మథ=కామముయొక్క, ఉద్వేజనాయ=పెంపొందుటకొఱకు, తుదతి=పీడించుచున్నది.

తా. మదించిన తుమ్మెదలగానములును కోకిలల యాలాపనములును పుష్పించినమామిళ్ళును కొండగోఁగులును స్త్రీల మనస్సులను తీక్ష్ణములగు ములుకులచే నొప్పించునట్లు పీడించుచు మన్మథోద్దీపకములై పీడించుచున్నవి.

ఆమ్రీ మఞ్జులమఞ్జరీ వరశరః సత్కింశుకం యద్ధనుః
జ్యా యస్యాలికులం కళంకరహితం ఛత్రం సితాంశుః సితమ్
మత్తేభో మలయానిలః పరభృతో యద్వందినో లోకజి
త్సోఽయం వో వితరీతరీతు వితనుర్భద్రం వసన్తాన్వితః.

టీ. ఆమ్రీ=మామిడి సంబంధమగు, మంజులమంజరీ-మంజుల=మనోహరమగు, మంజరీ = పూగుత్తి, యస్య = ఎవనియొక్క, వరశరః=శ్రేష్ఠమగు బాణమో, సత్కింశుకం-సత్ = యోగ్యమగు కింశుకం=పలాశకుసుమము, యద్ధనుః-యత్=ఎవ్వని, ధనుః=విల్లో, యస్య-ఎవ్వనికి, అలికులం-అలి=తుమ్మెదల, కులం=సమూహము, జ్యా=నారియో, సితాంశుః=చంద్రుఁడు, కళంకరహితం = కళంకములేని, సితం = తెల్లని, యస్య=ఎవ్వనియొక్క, ఛత్రం=ఛత్రమో, మలయానిలః=దక్షిణవాయువు, యస్య=ఎవ్వనియొక్క, మత్తేభః=మత్తగజమో, పరభృతః=కోకిలములు, యద్వందినః-యత్ =ఎవ్వనియొక్క, వందినః=స్తుతిపాఠకులో, సః=ఆ, అయం=ఈ, లోకజిత్=లోకములజయించు, వితనుః=మన్మథుఁడు, వసంతాన్వితః-వసంత=వసంతునితో, అన్వితః = కూడిన

వాఁడై, వరిజమీాఁదు, భద్రంఁమంగళమును, వితరీతరీతు = అధికముగ నిచ్చుఁ గాక.

తా. మనోహరము లగుమామిడిపూలగుత్తులే బాణములుగను పలాశ కుసుమములే ధనుస్సుగను తుమ్మెదపంక్తులే వింటినారిగను చంద్రుఁడే కళంక రహిత మగు తెల్లనిఛత్రముగను మలయవాయువే మత్తగజముగను కోకిలములే వందులుగను నుపయోగించుకొని చైత్రయాత్రను వెడలి లోకముల నెల్లఁ జయించుచుండు మన్మథుఁడు వసంతసమేతుఁడై మీాకు మంగళముల నొసంగును గాత.

ఇది శ్రీమహాకవి కాళిదాసవిరచితమగు ఋతుసంహార కావ్యమున వసంతర్తువను షష్ఠసర్గము సర్వము సంపూర్ణము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1954